శ్రీమత్పరదేవతాయైనమః

# శ్రవణానందము



శ్రీ

## తిరుపతివేంకటకవులు

వెల 1-8-0

శ్రీమత్పురదేవతాయైనమః

# శ్రవణానందము

శతావధానులైన

తిరుపతి వేంకటేశ్వర కవులచే

రచింపఁబడినది.

ప్రకాశకులు:

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి సన్సు,

వేంకటేశ్వర పబ్లికేషన్సు,

కడియం P. O.

తూర్పు గోదావరి జిల్లా.

1956.

ఇది శృంగారరస ప్రధానమైన

# చక్కని కల్పిత ప్రబంధము.

ఐదు ఆశ్వాసములు

★

ఏడవ కూర్పు.

1958.

వెయ్యి ప్రతులు.

★

ప్రచురణ.

వేంకటేశ్వర ప్రింటింగు ప్రెస్,

ఆలంపూరు.

శ్రీ ర స్తు

శ్రీమత్పరదేవతాయైనమః

# శ్ర వ ణా నం ద ము

## ప్ర థ మా శ్వా స ము

ఉ. శ్రీయును వాణియున్ వలయురీతిని జామరముల్ గ్రహించి కై
సేయ సమస్తనిర్జరవిచిత్రకిరీటమణీఘృణిచ్ఛటా
శ్రీయుతపాదపీఠ మగు సింగము తత్తడిమీఁద నొప్పు భ
ద్రాయితమూర్తి శాంకరి ముదం బిడు వేంకటరత్నమంత్రికిన్. 1

ఉ. కింకరకల్పభూరుహ మకించనభావశిలావిఘట్టనా
టంకము విష్ణుమానసవిటంక మనంతపయఃపయోధిరా
డంకకృతోజ్జ్వలత్సుకృత మై తగు నా సిరి వాడరేవు మా
వేంకటరత్నమంత్రికి నభీష్టవరంబు లొసంగుఁగావుతన్. 2

సీ. ఏనాతి కొకగుబ్బ గానశాస్త్రంబు రెం
డవగుబ్బ సాహితీడంబరంబు
ఏనాతియిలు సత్కవీశాననంబు రెం
డవయిల్లు చతురాననాననంబు
ఏనాతిప్రియశిష్యుఁ డానాకసంభవుం
డటుమీఁది శిష్యుండు వ్యాసమౌని
ఏనాతిపుత్రు లయ్యేడ్వురుమునులు దే
వమనుష్యులెల్లరుఁ బౌత్రభూతు

తే. గీ. లట్టిజగదేకసామ్రాజ్య మధిగమించి
వీణ చేఁబూని పాటగావించి మగనిఁ
గరఁగఁ జేసెడి యవ్వాణి వరము లొసఁగు
రాజహితుఁ డగు వేంకటరత్నమణికి. 3

తే. గీ. మొదట మన్మథు నడఁగింపఁబూని పిదప
గట్టిచెడి మన్మథునకోడి కాంత కర్ధ
దేహ మొసఁగి సదా తదధీనవృత్తి
నెసఁగు సాంబుఁడు కృతిపతి కిచ్చు శుభము. 4

క. నీలారమణీమణియు మ
హాలక్ష్మియు భువియుఁ దనకు నర్ధాంగులుగాఁ
నేళిన్ దేలెడి వేంకట
శైలేశుఁడు సంపదలనొసఁగుఁ గృతిపతికిన్. 5

తే. గీ. కలుములవెలంది గారాపుఁ గడుపుపంట
నుడుగులవెలంది నోఁచిన నోముపంట
జగము లన్నియుఁ గలిగింపఁజాలు దంట
బ్రహ్మ దీర్ఘాయువును గృతిపతి కొసంగు. 6

సీ. అఇఉణ్ మొదలుగాఁగ నాభాష్యపర్యంత
మే మహామహుఁడు మా కిచ్చె విద్య
కన్నసంతానంబుకన్న నెక్కుడుగాఁగ
నే దయాళుండు మమ్మాదరించెఁ
బెండ్లి పేరంటముల్ ప్రియ మెలర్పఁగఁ జేసి
యే గుణనిధి మమ్ము బాగుఁజేసెఁ
దిండికై యిల్లిల్లు తిరుగనీయక యన్న
మే యన్నదాత మా కింట నిడియె

తే. గీ. సకలదిగ్దేశరాజన్యసభలయందు
డంబు మీఱ శతావధానం బొసర్చి
నిర్వహింపఁగ నెవ్వఁ డాశీర్వదించె
నంజలి ఘటించెదము బ్రహ్మయ గురుమణికి. 7

చ. నిరుపమగ్రంథజాలము లనేకములన్ రచియించి సజ్జనా
దరముగ నా దివాకరసుధాకరతారక మచ్ఛకీర్తి బా

స్వరులగు కాళిదాసముఖసత్కవిచంద్రములకున్ ద్రయీవిధిన్
దిరుపతివేంకటేశ కవిధీరుల మే మొనరింతు మంజలుల్. 8

సీ. నన్నయకవి పెట్టినాఁడుకదా, తిక్క
నాదికవీంద్రుల కాదిభిక్ష
భిక్షలోపల భిక్ష పెట్టె శ్రీనాథాది
కవుల కెల్లరకుఁ దిక్కనమనీషి
శ్రీనాథకవిరాజశేఖరుం డల పెద్ద
నకవిత్వమునకుఁ బ్రాణమ్ము వోనెఁ
దరువాతఁ గవులకందఱకు మార్గముఁ జూపెఁ
దాతగా రయిన పెద్దన్నగారు

తే. గీ. వీరలును వీరిమార్గమ్ము గోరి యాంధ్ర
కృతులనొనరించి బహుబహుకృతుల నలరు
వారలును మాకుఁ బూజ్యులు వారికన్న
నితరకవిసత్తముల జోలి యేల మాకు? 9

తే. గీ. సోమయాజులమార్గంపు సొంపు గనక
పిన్న పెద్దల మర్యాద పేరు గొనక
భట్టురీతిని వాపోవునట్టి వట్టి
కాకవులుఁ గాకవులు నొక్కకడుపువారె. 10

తే. గీ. ఎచ్చటేనియుఁ దప్పుండు టేరికైన
భర్మమే భ్రాంతి పురుషులధర్మ మరయఁ
బటకు దెబ్బదిపదొకొండు తొటుకుచుండు
వారు వీరును నొకతీరువారు గారు. 11

తే. గీ. తనకు నాల్గు నిఘంటుపదములు వచ్చు
ననుచుఁ బదిమందికినిఁ దెలియంగ మాఱు
మూలపదములు గుప్పిన ముచ్చటగునె?
ప్రతిపదమ్మున రస ముట్టిపడినఁ గాక. 12

సీ. పాపిష్ఠిరాజులపాలి దయ్యమ్ము సం
ధ్యావందనమునకు బావగారు
పరదేశసంచార కరణమ్మునకు రైలు
జపతపమ్ములకెల్ల సవతితల్లి
ముక్తికాంతాసంగమునకుఁ దారుపుఁగత్తె
సద్యశోవ్యాప్తికిఁ జాటుడప్పు
ఆనందమునకు దివ్యాంగనాసంగంబు
రాజసంబునకు గారాలకూచి

తే. గీ. భాగ్యభోగ్యమ్ములకు నెల్లఁ బట్టుఁగొమ్మ
యఖిలవేత్తృత్వమునకు దివ్యాంజనంబు
సరసజనులకుఁ గర్ణ రసాయనంబు
కవిత యిట్టిది యని చెప్పఁగాఁ దరంబె ? 13

తే. గీ. కవులు నూతను లనియును, గత నవీన
మనియు నాక్షేపణ యొనర్తురంచు మేము
కొంచెమేఁ గుందు మైనను "గ్రొత్తక్రొత్త
కొమ్మన" యటన్న సామెత నమ్మినాము. 14

ఉ. అంచితులైనవార లిది యారసి యీరసమున్ గ్రహించి లా
లించినఁ జాలుఁ; గొందఱ "అవి లే యివి లే" యని గేలిసేయు వా
రంచు రచింప మానుదుమె ? యందఱినిన్ దనియింప మమ్ము ని
ర్మించిన బ్రహ్మకైనఁ దరమే ? యిది పెద్ద లెఱుంగ కుందురే ? 15

క. అని శిష్టాచారంబుల
నొనరించి యొక కృతి సేయ నున్నంతట మ
మ్మును వాదరేవుకుల వ
ర్ధన వేంకటరత్నమంత్రి రావించి యనెన్. 16

చ. తిరుపతివేంకటేశ్వరసుధీమణులార ! కవీంద్రులార ! దు
స్తరతరబుద్ధిభాక్కృతవధానవిధానపటిష్ఠులార ! దు

ష్కరము శతావధాన మొసకమ్మునం గన్గొన నిచ్చు పుట్టె మీ
కరయంగ దాన నేర్పు గల దంచు జగద్విదితంబు గావునన్. 17

క. మిముఁ బిలువఁ బంపితిని బే
ర్మి మెయిన్ మాయన్నగారి ప్రేరేపణచే
శ్రమ మెన్నక వచ్చితిరి ము
దము నొనరించితిరి మిగుల ధన్యుఁడ నైతిన్. 18

తే. గీ. కవు లనేకులు జగమునఁ గలరు గాని
శాస్త్రవేత్తలు గా; రట్టి శాస్త్రశక్తి
గలిగి కవితావిశేషంబు గలిగి శతవ
ధాన మొనరింప మీవలెఁ దగ దొరులకు. 19

క. ఊరూరికి వొక్కొక రవ
తారం బెత్తిరఁట శతవధానము చెఱుపన్
గారుపులిఁ జూచి నక్కయు
నారూఢిగ వాఁత లిడిన నట్లగు నేమో. 20

తే. గీ. రామరాజభూషణుఁడు ధర్మసుకవియును
మాడభూషి వేంకటకవిముందన్నుండు
కవులలోపల విఖ్యాతి గాంచి శతవ
ధానమొనరించి రనుచు వదంతి గలదు. 21

తే. గీ. అంతియే కాని చూడ లే దనుచు శతవ
ధాన మష్టవధానంబుఁ దగ నొనర్పఁ
జేసి బహుమతు లొనరించి స్నేహరీతి
దనర నొకతటి నంతికోద్యానమందు. 22

వ. వినోదంబుగాఁ గతిపయ మిత్రసహితుండై కూర్చుండి యస్మద్విరచి
తమ్ము లగు ధాతురత్నాకర కాశీసహస్ర శృంగారశృంగాటక శుకరంభా
సంవాదాదికంబులగు సంస్కృత గ్రంథంబుల నచ్చ టచ్చటి శ్లోక
మ్ములను వేంకటగిరి గద్వాల విజయనగరాది సంస్థానమ్ములఁ బ్రసం

గవళమ్మున నొనర్చిన చాటుపద్యమ్ములును విని సంతసింపుచు మేదు
రంబగు సాదరమ్మున మమ్ముం గాంచి యిట్లనియె. 23

చ. తెలుఁగునఁ జాటుపద్యములు తీయనలై యలరారఁ జేయు మీ
రలు పనిఁబూని యందమగు గ్రంథ మొకం డతినూతనమ్ముగా
నలరియు నీతియుక్త మగునట్లు ప్రధాన రసంబు చిప్పిలన్
గలయ రచింప రాదె; కృతినాయకుఁగా ననుఁజేసి యొప్పుగన్. 24

ఉ. తాత కృతీంద్రుఁడయ్యెఁ బినతాతకుమారుఁడు సుబ్బరాయవి
ఖ్యాతుఁడునుం గృతింగనె నఖండయశుండు భుజంగరావు వి
ద్యాతరుణుండు మాకుఁ బినతండ్రి యతండొక సత్కృతిన్‌గనెం
దాతలనాఁటనుండి కృతినాథులు మాదుకులీను లందఱున్. 25

తే. గీ. రాజులచరిత్రలును గవిరాజచరిత
ములును గ్రంథమ్ములకు వన్నెగలుగఁజేయు;
నందులో నాఘనమ్మున కరసి చూడఁ
గవులకతలకు రాజులకతలు లొచ్చు. 26

వ. కావున నేదేని యొక కవిచరిత్రఁబు శృంగారరసప్రధానంబై నీతియు
క్తం బగునటులఁ గల్పించి యొనర్చుట నాయభిమతంబని చెప్పి
సబహుమానంబుగాఁ గర్పూరతాంబూలంబుఁ బెట్టుటయు. 27

సీ. అతిరహస్యంపు సంగతికిఁ దాళపుఁబెట్టె
మంచిచెడ్డలకుఁ జూపించుత్రోవ
కాలయాపనకుఁ జక్కనియుపాయం బమి
త్రధ్వంసమునకు ఫిరంగిగుండు
ఘనకార్యములకుఁ బెట్టినపేరు దారిద్ర్య
భంజనమ్మునకుఁ దుపాకిదెబ్బ
యాపన్నివారణ కౌషధప్రాయమ్ము
తులలేని సుఖదుఃఖములకుఁ ద్రాసు

తే. గీ. ఆత్మసంరక్షణమున కిమ్మైనకోట
సంశయమ్మునకు వినాశసమయ మరయ
సకలలోకోపకారంబుసలుపు సుజన
మైత్రికన్నను వేఱొండు మహిఁ గలదె? 28

వ. అని చెప్పి కృతినాయకు వంశావతారంబు వర్ణింప నారంభించితిమి.

వంశవర్ణన

తే. గీ. అబ్జసూతిమొగమ్మున నవతరించి
నిగమములతోడఁ బుట్టువై జగతి మొదటి
వర్ణమనఁదగు బ్రాహ్మణవర్ణమందు
శ్రీలఁ దులఁదూఁగుచుండు రార్వేలవారు. 30

క. ఆ యార్వేలనియోగుల
లో యోగము గల్గి మిగుల లోకోన్నతను
శ్రీయును విద్యయు యశమును
బాయనిదై వాదరేవువంశం బలరున్. 31

చ. అవనిపుమంత్రియై యశము నందనివాఁడుఁ బరోపకారమున్
దవులనివాఁడు సంతతవదాన్యత మించనివాఁడు భూసుర
ప్రవరుల కన్నదానము నపార మొసర్పనివాఁడుఁ బండితా
శ్యవశుఁడు వాదరేవుకులమందు జనింపఁ డదేమి చిత్రమో! 32

తే. గీ. అక్కులక్రమమందుఁ దా నవతరించె
మంత్రిమాన్యుండు కృష్ణయమంత్రిమౌళి
సత్యసంధుండు త్యాగి యాజన్మభోగి
యతులితాన్నప్రదాత విఖ్యాతిఁ జేత. 33

క. ఆకారము సౌశీల్యం
బేకాకృతిఁ జెందినట్టు లెసక మెసఁగె సు
శ్లోకుఁడు నతిలోకుఁడు నగు
నాకృష్ణయభార్య పాపమాంబిక సతియై. 34

క. లలితాంగి యగుచుఁ దగుతన
తలనీతిలకమ్మునం దతఁడు గనె ముగురన్
జెలమయఁ బెదచినసీత
న్నల లలితాకృతులఁ గృతుల నవనవమతులన్. 35

చ. ఇలఁ గల మంత్రిపుంగవుల కెల్లరకున్ దల దాఁటి బుద్ధి లో
పల గురు వంతయై కవులపాలిటికల్పనగంబుఖాతిఁ గో
ర్కొ లొసఁగు రామచంద్రనగరీనరపాధిపుఁగూర్మిమంత్రియై
చెలమయమంత్రి వర్ధిలె విశేషయశస్ప్రద[illegible] 36

తే. గీ. లీలమెయిఁ బల్లకీలోని కొలువు నేల[illegible]
బెట్టకే చెలంగుసరావడ సెట్టికొనఁగఁ
జెలఁగె సత్యవరపుఁదహసీలుదారుఁ
డగుచు ననయము నాచెలమయ్య మంత్రి. 37

చ. చెలమయమంత్రికిన్ సుగుణసేవధికిన్ దగులేమయాన్ సతీ
తిలకము చారుతావిధికిఁ దేట గుణమ్ములపేటి "యచ్చమా
లలనకుఁ సాటి రాఁదగరు లాఁతివెలందు" లటంచు నెంత్రు లో
కులు, చెలమయ్య యాతరుణికోప మొనర్చెవపుణ్య మెట్టిదో! 38

చ. చెలమయమంత్రి కచ్చపకు శ్రీకరుఁ డార్యనుతుండు సద్యశో
విలసితదిగ్వితానుఁ డగు వేంకటరాయఁడు గృష్ణయాఖ్యుఁడున్
గలితగుణాఢ్యుఁడై సొబగుఁ గాంచిచెలంగెడు సుబ్బరాయఁడున్
గలిగిరి పుత్రులై సమధికంబగు బుద్ధిబలంబుడంబునన్. 39

చ. సుజనులయందు రక్తి పెరసుందరులందు విరక్తి దైవత
ద్విజగురులందు సక్తి నిరుపేదలయందు సమప్రసక్తి దు
స్త్యజరిపుషట్కముక్తి సరసంబగుభుక్తి మృదూక్తియుక్తి వి
శ్వజనసదానురక్తి సహజమ్ములు వేంకటరాయమంత్రికిన్. 40

తే. గీ. సకలమతసారసిద్ధాంతసంగ్రహంబు
నానరిచినమేటి నాచికేతునిచరిత్ర

మల్లికార్జునకవిజనమౌళిచేతఁ
గృతిఁ గనినమేటి యాతని కెవరు సాటి ! 41

తే. గీ. మహితసోమేశ్వరస్వామి సనికిపట్టు
గౌతమీపుణ్యతీరప్రకాశితంబు
పూసపాటిమహేంద్రునిప్రోలు కోటి
పల్లెరాణాకు నేతయై ప్రబలెనతఁడు 42

తే. గీ. భర్త కనుకూల యతిథులపాలియన్న
పూర్ణ సకలసుగుణములపుట్టినిల్లు
నమ్మహాలక్ష్మిసాటి క్రామమ్మ తనకు
ధర్మసతి గాఁగ నచ్చమాతనయుఁ డలరె. 43

క. ఆ యిరువుర కుదయించిరి
ధీయుతుఁడు చెలమయమంత్రి ధీరుం డగునా
రాయణమూర్తియు సుజనవి
ధేయుఁడు భుజంగరాయుఁడీ నేతధియున్. 44

ఉ. మేధమెయిన్ బృహస్పతిసమీకృతుఁ డా చెలమయ్య మంత్రి గం
గాధరరామరాయనృపకాంతుఁడు రావుకులాగ్రగణ్యుఁ డా
రాధితసత్కవీంద్రుఁ డతిరమ్యుఁడునై తగు పీఠికాపురీ
నాధునిమంత్రియై యశముతన్ దెర గప్పె దిగంత మంతటన్. 45

తే. గీ. అతఁడు మంత్రిత్వమువహించి యఖిలరాజ
కార్యముల నిర్వహించెడికాలమందు
రాజురాజను మాటమాత్రంబుకాని
రాజునెఱుఁగరు ప్రజలు చిత్రంబు గాదె ? 46

చ. పదునగు సన్న యన్నమును బట్టి వదల్చినఁగాని జిడ్డు కే
ల్వదలనిమంచినేయియును బాయసమున్ బలుపిండివంటలున్
మదికి ముదం బొసంగెడిఘుమంఘుమఁ బొల్చెడికాయగూరలున్
బొదలఁ దదీయపఙ్క్తిఁ దిని పోదురు బ్రాహ్మణు లెందఱేనియున్.

ఉ. క్రాఁగినవేఁడినీళ్ళను సుఖంబుగ స్నానముఁ జేసి తృప్తిగా
నోగిరమున్ భుజించి సొగ సొప్పెడిసత్రపుఁజావడిన్ సుఖ
శ్రీ గణియించుచున్ నిదురఁజెందుచుఁ జెల్మయమంత్రి నెంతు ది
రాగతు లైనబ్రాహ్మణు లహా! యని సొక్కుచుఁ గత్తిపూడిలోన్.

ఆ. వె. వాడరేవువంశవర్ధనుం డగుచెల
మయ్య కత్తిపూడియందు సత్రి
ముంచు కారణమున నొక్కింత చోరుల
బాధ తగ్గె నడచు పరిజలకెల్ల. 49

సీ. చలము మీఱంగ శత్రుల జయించి ప్రతాప
మార్జించి మించెఁ దిక్కన్నమంత్రి
పైఁడియాకులలోనఁ బండితకవికోటి
కన్నముఁ బెట్టె విస్సన్నమంత్రి
బలుచమత్కారంబు గలగ్రంథములకు నా
యకుఁడై చెలంగె సింగన్నమంత్రి
యదుకవాళ్లకు నెక్కుడుగమాన్యము లిచ్చి
యశముఁ గైకొనియె నక్కన్నమంత్రి

తే. గీ. యొక్కొకరి కొక్కొక విశేషమున్నదంతె
కాని యన్నివిశేషముల్ గలుగలేదు
కలిగెఁబో! యివియన్ని యఖండుఁడైన
మహితవాడ్రేవు చెలమయామాత్యమణికి. 50

తే. గీ. అన్నిటికి నేమి గాని కార్యార్థి యగుచు
నెటి కేగిన నేలాటియెదలనైన
వందవందలకొలఁది సద్బ్రాహ్మణులకు
నిత్యమును వంట చెలమయామాత్యువెంట. 51

ఉ. భావిపురాతనాద్యతనపార్థివులం దల పీఠికాపురీ
రావునృపాలశేఖరుని రాణకు మించిన రాజచంద్రు, వా

దేవుకులుఁడుఁ దన్నరివరేణ్యుని మంత్రియునైన చెల్మయన్
జేవ నెదుర్చుమంత్రిజనశేఖరునిఁ గనఁబోల దొక్కెడన్. 52

తే. గీ. చతురమతియును గడుఁ జండశాసన ప్ర
భావుఁడగు కూచిమంచి గోపాలకృష్ణ
మంత్రి గారాపుఁగూఁతురు మహితసుగుణ
యైన కామేశ్వరమ్మఁ బెండ్లాడె నతఁడు. 53

క. ఆ కామాంబిక గుణముల
కాకరము సతీత్వమునకు నాలయము శుభ
శ్రీకిన్ దా వై చెలఁగె ర
మాకాంత యనంగ నయ్యుమాకాంత యనన్. 54

చ. అలచెలమయ్యమంత్రి గనె నాసతియందు మనోజతేజునిన్
విలసితసద్యశఃకలితు వేంకటరావు ననంతకాంతి జొ
బ్బిలు గుణవంతు నప్రతిము వేంకటరత్నసమాఖ్యు నల్వురన్
సలలితరూపశీలవిలసన్మతులై తనరారు కూఁతులన్. 55

సీ. ఇరువురు నాకృతి యెసకంబు గలవార
లిరువురు సమశైలిఁ బరఁగువార
లిరువురు గుణముల నెన్నంగఁ దగువార
లిరువురు యోగ్యత నెసఁగువార
లిరువురు నన్నంబు నిడ వాస్థగలవార
లిరువురు విద్యల నెఱుఁగువార
లిరువు రింగ్లీషులోఁ బరిచితి గలవార
లిరువురుఁ గవులకు నిచ్చువార

తే. గీ. లిరువురును భాగ్యభోగ్యముల్ వఱలువార
లిరువురును దాతతండ్రుల సరణివార
లమరు వేంకటరాయరత్నముల కతిశ
యోక్తిగా నేర దిది స్వభావోక్తిగాని. 56

తే. గీ. తగు "కలెక్టరు" వ్యాసనూత్రిములు తెల్గు
నన్ బొనర్చిన యాజగన్నాధరావు
తనయ వేంకటరత్న మాతరుణిఁ బెండ్లి
యాడె వేంకటరావు ప్రఖ్యాతి యెసఁగ. 57

క. ఆవెలఁదియంచు వేంకట
రావాక్కకుమారుఁగవియె రమ్యాకార
శ్రీ వెలయువానిఁ జలపతి
రావున్ గామేశ్వరియన రంజిలు కూఁతున్. 58

క. ఆ వేంకటరావు పున
శ్శ్రీ వెలయఁగఁ బెండ్లియాడెఁ జెల్లాయమ్మన్
భావుకగుణసంపన్నన్
భావమునకు వచ్చినట్లు పరఁగెడిసాధ్విన్. 59

తే. గీ. పెద్ద 'తహసీలుదారుఁడై' పేరుగొన్న
తేజుగల నందివాడ పేర్రాజుకూఁతు
నసుగుణగుణాఢ్యఁ బద్మనాభమ్మయనెడి
రమణిఁ బెండ్లాడె వేంకటరత్నమంత్రి. 60

శా. ఆరూఢాఖిలభోగభాగ్యములచే నాపద్మనాభమ్మయం
దారోగ్యాయురపారసౌఖ్యగుణగణ్యాకారసౌభాగ్యస
త్కారన్ వేంకటరత్నమంత్రిగనియెన్ గామేశ్వరీనామక
న్యారత్నమ్మును సొంపు పెంపు వెలయన్ గామేశ్వరీపత్కృపన్. 61

(షష్ఠ్యంతములు)

సీ. ఏతాదృశస్ఫీతిభూతివిఖ్యాతివి
ద్యాతిశయద్యోతితాంతరునకు
సంస్కృతాంధ్రకవిత్వసారస్యమారంద
ధారామధుకరాయితశుభమతికిఁ
జెలమయామాత్యసంచితపుణ్యరాశికిఁ
గామేశ్వరాంబికాగర్భమణికిఁ

బద్మనాభాంబికాపతికి వేంకటరాయ
సోదరునకు దాత్మసోదరునకు
తే. గీ. వాడరేవు కులాబ్ధిపూర్ణోడుపతికిఁ
బ్రథితమౌద్గల్యమునిగోత్రపావనునకు
సరసకవిజనపికపుష్పసమయమునకు
మహితవేంకటరత్న సన్మంత్రిమణికి. 62

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా మా యొనర్పఁబూనిన కేవలకల్పిత ప్రబంధంబగు శ్రవణానందమ్మునకుఁ గథాక్రమం బెట్టి దనిన. 63

(కథా ప్రారంభము)

చ. కల దొకపట్టణంబు కలకాల మపారసుధాశనంబుచే
నలరు రసజ్ఞ యన్నమున కాసలు సేయ ధరాతలమ్ములో
పల జనియించి పాతుల నెపమ్మున నుండెడి దేవకోటినాఁ
జెలఁగెడి శిష్టకోటికిఁ బ్రసిద్ధ మనంతపురాభిధానమున్. 64

సీ. అరుణోదయమున నిత్యస్నాన మొనరించి
యక్షీణపరిధానమ్ము లాచరించి
నీర్కావిదోవతుల్ నియతిగా ధరియించి
పలుమాఱు పింజెపింజెలు ఘటించి
భూతిరేఖలు మూఁడు మొగమునఁ గీలించి
భ్రూమధ్యమునఁ జుక్కబొట్టుఁ బెట్టి
నారికేళకటాసనమ్ములఁ గూర్చుండి
జందెపువరణల్ పలుపుకొనుచు
తే. గీ. బ్రహ్మచారులు వేడ్క సంభ్రమముతోడ
ననువదించుచు నుండఁగా ననుదినంబు
వేదసంతలఁ గాలమ్ము వెళ్ళఁబుత్తు
రనుగుణమ్ముగ వైదికు లప్పురమున. 65

సీ. రాజు లెల్లరును భార్గవరాములే యనఁ
దేజంపుఁ బెంపు నుతింపవలెనె?

కోమటు లెల్ల జక్కులరాజులే యన
నైశ్వర్యములపెంపు లడుగవలెనె ?
పాదజు లెల్లను బలరాములే యన
హలసంపదలు నొక్కి పలుకవలెనె ?
వెలకాంత లెల్ల రంభలె యన్న రూపసం
పద లిట్టి వంచుఁ జెప్పంగవలెనె ?

తే. గీ. వనము లెల్లను నందనవనములె యనఁ
గుసుమసంపత్తులను వేఱె కొసరవలెనె ?
యనఁగఁ జెలువారు నవనిలో ననుపమాన
పుణ్యభరితం బనంతాఖ్యపురవరంబు. 66

చ. చదువుల నన్నియున్ జదువఁజాలిన శిష్యులు చుట్టుముట్టఁగా
నది యిది యంచు నెంచక సమస్తరసమ్ములతోడ నెప్పుడె
య్యది ప్రకృతంబొ తద్రసమయత్వము నొంది వచింపుచుందు రొ
ప్పిదముగ నప్పురంబునఁ గవిప్రవరుల్ సరసత్వ మొప్పఁగన్. 67

వ. అట్టి కవిపుంగవులందు విశిష్టాద్వైతమతమ్మున. 68

క. మేదురసంపద్యుక్తుఁడు
మేధావి యశస్వి సుకవిమిత్త్రుఁడు కవితా
మోదామృతాంబునిధి మధు
సూదనుఁ డను నొక్క సుకవిసుందరుఁ డొప్పున్. 69

ఉ. చిన్నతనమ్మునన్ గడుఁ బ్రసిద్ధపు విద్యల నభ్యసించి సం
పన్నత గల్గి కుందకుసుమం బనఁ దల్లికిఁ దండ్రి కొక్కఁడై
వన్నెయు వాసియున్ రుచిరవర్తనమున్ జెలువార నొప్పు న
ప్పెన్నిధి, తల్లిదండ్రు లిల పెత్తన ముత్తమరీతిఁ జేయఁగన్. 70

ఉ. "మానవదేహ మెంత మతిమంతున కింతటిలోన నోనమా
లైనను రావు వానిఁ గనినయ్యుమ యెంతటి పుణ్యశాలులోఁ
గాని సుఖమ్ము లిట్టిసుతుఁ గాంచినవారలవే" యటంచుఁ బే
రాని నుతింత్రు కేళిసమయమ్ముల దంపతులెల్ల నాతనిన్. 71

సీ. "నాకళ్ళయెదుట మొన్నటిదాఁకఁ జిన్నత
నంపుఁజేష్టల సంచరింపలేదొ!
నాకళ్ళయెదుట నున్నతిలేక వెఱ్ఱి నా
వీథివీథుల విఱ్ఱవీఁగ లేదొ!
నాకళ్లయెదుట నెంతయువింత రఘువంశ
మును జంకఁబెట్టుక చనఁగలేదొ!
నాకళ్లయెదుట నున్నతు లెల్ల నవ్వంగఁ
జిటిపొటిపద్దెముల్ సెప్పలేదొ!

తే. గీ. ఎంతలో నెంతవాఁడయ్యె! నెంత బుద్ధి
వచ్చె! నెటువంటి సత్కీర్తి వచ్చెఁ! జిత్రి"
మనుచు నాతని చర్యలే యభినుతింత్రు
పండితవరేణ్యు లక్కవి భాగ్య మేమొ! 72

క. ఎప్పుడు మనమునఁ దలఁచినఁ
దప్పక కడుపారఁగన్నతల్లింబలెఁ దా
నప్పరమేశ్వరి యాతని
కప్పుడె కననౌను బుణ్య మది యెట్టిదియో! 73

సీ. కవితఁ జెప్పఁగనేర్చుఁ గఱవు దీఱఁగ వేయి
గంటాలకైన నిష్కంటకముగఁ
జదువుఁ జెప్పఁగనేర్చు శబ్దశాస్త్రాదికం
"బది మే" లనుచుఁ బండితాళి మెచ్చ
మద మడంపఁగ నేర్చుఁ బదిమంధికవు లొక్క
టై దుష్టవాదమ్ము నందుకొనిన
మాటలాడఁగ నేర్చు మధురమ్ముగా విన్న
వార లెల్లరును 'వహ్వ' యనంగ

తే. గీ. 'బాగుబా' గనియనఁ బాటఁ బాడనేర్చు
నతులితంబుగఁ జదరంగ మార్చుడనే

వడివడిగ ముత్యములరీతి వ్రాయవేర్చు
సుందరగుణాఢ్యుఁ డమ్మధుసూదనుండు. 74

చ. అతని కవిత్వముల్ విని 'యహో' యని మెచ్చవిబుద్ధిమంతులున్
జతురునిఁ జూచి వానిసరసత్వముఁ గోరనిప్రౌఢకాంతలున్
సితకిరణానుషంగమును జెంది కరంగనిచంద్రకాంతముల్
క్షితిని "నహిప్రతిల్లె" యని చెప్పుదు రాతవిభాగ్య మెట్టిదో! 75

తే. గీ. సుధకు మాధుర్యమున్ బలె, సూర్యువకును
తైక్ష్ణ్యముంబలె శశికి శీతలతవోలె
నెంతచెప్పిన నాతవియెడల.నతిశ
యోక్తి గాఁజాల దది స్వభావోక్తి యగుట. 76

ఉ. పొంకము మీఱ నాసుకవిపుంగవువీధిక నొక్కవేశ్య మీ
నాంకువిచేతిబాణ మన నందముఁ జందముగల్గి శైశవా
లంకృత యయ్యు విద్యల నలంఘ్యపటుత్వము గాంచి మించు వి
శ్శంకగ దానిఁ బోలఁగలసారసనేత్రను జూడ మొక్కతెన్. 77

క. లీలలలోఁ దగువేశ్యా
బాలలలో మిన్నయగుచుఁ బరఁగినకతనన్
బాలామణి యందురు త
ద్బాలామణిలీల లెన్న బమ్మకుఁ దరమే? 78

తే. గీ. బాల్యవయసుననుండి యాబాల చాలఁ
గవివరునితోడఁ గ్రీడింపఁగాఁ దలంచి
క్రమముగా సురతోపయోగమున కద్దు
దీటి పదునాలుగేండ్ల యొయారియయ్యె. 79

సీ. "పాడెనా! గంధర్వపాటలాధరల వీ
ణానినాదంబు చిన్నతన మూను
ఆడెనా! రంభాముఖాప్సరోభామినీ
వర్గ మెల్లను దల ల్వంచుకొనును

కూడెనా! యక్షేశుకోడుకైన బుణ విము
క్తికిఁ దగ్గధన మిచ్చి తేలలేఁడు
వేఁడెనా! వేదాంతవిద్యావిశేషజ్ఞుఁ
డైనను మాఱుమా టాడలేఁడు"

తే. గీ. అనుచుఁ దనుఁజూచుజనులెల్ల నభినుతింప
సాటిబోటులలో నీటుగోటుఁగల్గి
వఱలె నౌరౌర! ఐరిర! వహ్వా! వహావ్వ!
మేలుమేల్! రాజధాని యాబాలసాని. 80

క. అమ్మధుసూదనుసార
స్యమ్మను విని సోయగమ్మ నరసియు ననురా
గమ్మ మదినూనె దైవక
తమ్మన నబ్బాల దానిదశ యెట్టిదియో! 81

గీ. వయసువాఁడఁట! యామీఁద వైష్ణవుఁడఁట!
సుకవియఁట! సూక్తినిధియఁట! సోయగంబు
గలుగువాఁడఁట! మనములు గరఁచకున్నె?
ఱాఁతికైనను నేలాటినాతికైన. 82

వ. ఇట్లు తదధీనచిత్తయై తన మనమ్మున. 83

సీ. ముద్దుమాటల ముక్కుమొగ మెఱుంగనివాని
ధనమేల? వానిసౌందర్యమేల?
బంధవ్యవాయసంపద లెఱుంగనివాని
ధనమేల? వానిసౌందర్యమేల?
చుంబనప్రక్రియాసుఖ మెఱుంగనివాని
ధనమేల? వానిసౌందర్యమేల?
సరసనంగీతవైఖరు లెఱుంగనివాని
ధనమేల? వానిసౌందర్యమేల?

తే. గీ. ఇన్నియును గల్గి జగతిలో వన్నె కెక్కి
సతులఁ దేలించు సుకవిపండితుల నకల

రతులఁ దేలింప కతిధనయుతుల నధమః
తతులఁ గవఁగూడు తనువులగతు లవేల ? 84

వ. ఇట్లు పట్టరానితమకమ్మ చుట్టుముట్ట నెట్టకేలకు గుట్టుచెడి తల్లికి మెల్లనఁ దనమనోభిప్రాయం బెఱింగించి సిగ్గువిడిచి యిట్లనియె. 85

చ. చతురుఁడటంచు సర్వకవిసత్తముఁడంచు మహాత్ముఁడంచుఁ బి
న్నతనమువాఁడటంచును ఘనమ్ముగ నాతనిఁ జెప్పికొందు రే
యతివకుఁగల్గునో యతని నర్మిలిఁగూడి సుఖింపు టెన్న నా
యతివయె ధన్య, జన్మ మన నయ్యదియే ! సొగసన్న నద్దియే ! 86

ఆ. వె. సరసుఁడగుచు సర్వసందర్భములయందుఁ
బెద్దయయ్యు వయసుపేర్మిచేతఁ
బిన్నయైనవాని మన్ననలేకున్న
సానకిత్రిందివన్నె దానివన్నె. 87

తే. గీ. కలిమి గలవా రనేకులు గలరుగాని
తెలివిగలవారుకారు; నాతీరుతెలివి
గలుగువారలఁ గూడఁగాఁ దలఁచియుండుఁ
గాని ధనవద్ద్విపాత్పశుగణముఁగాదు. 88

క. ధనవంతులు ధనవంతులు
ధనవంతులటంచుఁ బల్కెదవుకాని సదా
ధనమెంత తెచ్చియిచ్చిన
ధనమా ? మఱి సౌఖ్యకరము తల్లీ ! చెపుమా. 89

చ. "వెలధనమింత" యం చనిన వేగమె యాధనమిచ్చి మచ్చుమం
దులు వెదఁజల్లినట్లు కడు దొంగవిలాసము లూనుకట్టిబొ
మ్మలఁ గవఁగూడువారి యధమంబగుజన్మము నొక్కజన్మమా ?
వలచినబాలికన్ గవయువారిది జన్మముగాక తల్లిరో ! 90

తే. గీ. విత్తమార్జించు పనికినై వేలకొలఁది
గా నుపాయములున్నవి కాని శార

దాకుచమ్ము లు గలవాఁడు దక్క నితరుఁ
డింతి కుచములు బట్టిన నేమిసుఖము? 91

తే. గీ. గర్భగతునకునైనను గల్పనమ్మ
నేయు వృత్తినటంచును జెప్పుచుండ్రు;
పెట్టఁడా! పట్టెఁడన్నము పృథివిలోన
మనలఁ బుట్టించినట్టి యవ్వనజభవుఁడు. 92

తే. గీ. అదియునుంగాక నీవు ద్రవ్యంబు వేల
కొలఁదిగా నార్జనముఁజేసి కూడఁబెట్టి
యుంటి; వయ్యది చాలదే? యొరులకీయ
మేమును భుజింప నాకకు మేరగలదె? 93

తే. గీ. ఇట్లు బాలామణియును గామేచ్ఛపట్టఁ
జాల కాచార్యతనయుండు చాల సరసుఁ
డనుచుఁ దనతల్లితోడ ధనాశ గూడ
దనుచు బోధించి బోధించి యనియె మఱియు. 94

చ. "వితతయశుండు ధార్మికుఁడు వేలకువేలు గణించువాఁడు పం
డితుఁడు సమస్తరాజమకుటీమణిరంజితపాదుఁ డార్యస
న్నుతుఁడగు నాథరాట్సుతుఁ డనుంగుఁ బ్రియుండగుఁగాక" యంచు స
న్నుతి యొనరింతు నెంతయు నినున్, సమకూర్పఁగదే! రయమ్మునన్.

తే. గీ. అనుచుఁ దనతల్లితోడఁ జెప్పినదికాని
తానుతానయి స్వాతంత్ర్య మూనదయ్యె;
నెంతవలపున్న నెంతవలంతియైన
జననిఁ గికురింపలేదు వేశ్యావధూటి. 96

చ. అను తనపుత్రిమాటలు హృదబ్జము బిట్టలరింప వృద్ధభా
మినియు మనమ్ములో సుతకు మేలు గణింపుచు "మంచిదమ్మ! నీ
కనుగుణుఁడైన పూరుషు రయమ్మున నే సమకూర్తునమ్మ! నీ
వనుమితి మానుమమ్మ! మనమం" దనుచున్ గడుఁ బ్రీతిఁ బల్కుచున్.

ఆ. వె. కూఁతుఁ బుజ్జగించి కొమరారఁ దీవించి
చింత వలదటంచుఁ జెప్పి చెప్పి
వానిఁ దెచ్చు టెంత పని యంచు నూరించి
యిట్టు లనియె మగల వృద్ధవేశ్య. 98

ఉ. "చిన్నతనమ్మునందు సమశీలవయస్కులఁ బిన్నవారలన్
గ్రన్ననఁ గూడి యల్లరి యొనర్చుచు నుండఁగఁ జూచి పెద్ద లే
మన్నను సర్వదా మనగృహమ్ముల నుండెడివాని కింత య
త్యున్నతి వచ్చెఁగా?" యనుచుఁ దోఁచును నాకు ముదంబు నెమ్మదిన్.

ఉ. స్త్రీలను జూడఁ డెన్నఁడును శిష్యులపాఠము లెప్పుడున్ విడన్
జాలఁడు కార్యమున్నను బజారునకైనను రాఁడు భావమున్
బోలఁగఁజేయఁ దట్టిమధుసూదనునిన్ వరియించి తమ్మరో!
గోలవు, వాని నెట్లు సమకూర్తుఁగదే? జగదేకసుందరీ! 100

తే. గీ. పండితులయొద్ద మాయలు పనికిరావు
మాయ పన్నిన నద్ధరామరుఁడు పిదప
వించుకేనియుఁ దెలిపి శపించె నేని
దనయ! యొకగవ్వకైనను బనికిరాము. 101

ఉ. లోకములోన మానవులలో ద్విజులే ఘను, లంతకన్న న
స్తోకకలావిదుల్ ఘనులు, సూరివరేణ్యులకన్న సత్కవి
త్వాకలనమ్ము గల్గెడి మహాత్ము లమోఘవచస్కు లమ్మ! వీ
రేకద? మాపి రెందఱ నరేంద్రులనో వచనాశుగమ్ములన్. 102

సీ. సాహిణిమారుండు చచ్చిపోవుటఁ జూడఁ
గవివరేణ్యుల కోపకలనఁ గాదె?
రాజకళింగగంగరాజు భిక్షుకుఁ డౌట
కవివరేణ్యుల కోపకలనఁ గాదె?
పోతనరేంద్రుండు పొలియుసంగతిఁ జూడఁ
గవివరేణ్యుల కోపకలనఁ గాదె?

పెద్దాపురపుఁగోట పెద్దమ్మ కిల్లాట
కవివరేణ్యుల కోపకలనఁ గాదె ?

తే. గీ. కరుణ గల్గిన నిల్లు బంగార మౌను
గరుణ దప్పిన నడవియౌ గడియలోన
బ్రహ్మకొడుకైనఁ గవులకు భయముఁజెందు
మన మనఁగనెంత ? యమ్మక్క ! మదిని జూడ. 103

తే. గీ. ఐన నొక్కయుపాయంబుఁ బూని వాని
మనగృహం బేగుదెంచు నట్లనుఘటింప
వలయు; నవ్వైష్ణవసుతుండు వచ్చువఱకుఁ
జిలుకవలె నుండు మీవు సొమ్ములుధరించి. 104

వ. ఇట్లు తనతనయ నొప్పించి యిప్పని యెట్లు సమకూర్తునని మనమ్మున యోజించుచున్నంత నొక్కనాఁడు దైవవశమ్మున నమ్మధుసూదనుండు.

క. కట్టున్ బొట్టున్ జుట్టున్
బిట్టుపసం బుట్టఁజేయ బిరబిరమనుచున్
నెట్టనఁ దనవీధిం జను
పట్టున సడిఁగట్టి వృద్ధవారాంగనయున్. 106

తే. గీ. ఎదురుచని "స్వామి ! మీదాసి పదములకు న
మస్కరించుచునున్నది మాగృహంబు
చెంత కొకసారియైన వేంచేయవలదె ?
మహిఁ బ్రపత్తికిఁ దారతమ్యములు గలవె ? 107

వ. అదియునుంగాక యేడుమూఁడు పురుషాంతరమ్ములనుండి మీపూర్వుల మంగళాశాసనపరిభావమ్మునను దిరుమంత్రోపదేశ పరిభావమ్మునను నొక్కింతయుఁ గొదవలేక నేఁటివఱకు వర్ధిల్లుచుంటిమి. మాయర్థ ప్రాణమ్ములు భవదధీనమ్ములగుటం జేసి. 108

క. ఒకమాఱు మాదుగేహము
నకు దయసేయకయె చనుట న్యాయమె మీకున్ ?
సకలజనులు భగవంతున
కొకటేకద ! పక్షపాత ముండునె ? చెప్పుఁడీ." 109

తే. గీ. అనుచుఁ బల్కిన పల్కుల కతఁడు షాఋ
మాటఁ జెప్పఁగలేఁడాయె; షాహిని బల్మి
చేతఁ బాలైనఁ ద్రావదు స్నేహరీతి
చేత విషమైనఁ ద్రావుట సిద్ధము కద ! 110

తే. గీ. నక్క పొదరిల్లు పంచాననంబు కరణి
వారకామిని యిలు సొచ్చె వైష్ణవుండు;
ఎన్ని చదువులు చదివిననేమి నీచు
లకు గురుత్వంబు వైష్ణవులకు సతంబు. 111

క. మత్యమరాచార్యసమ
ప్రత్యయసచివాగ్రగణ్య ! పండితసుకవి
స్తుత్యా ! వేంకటరత్నా
మాత్యమణీ ! సుజనకమలమాన్యద్యుమణీ ! 112

చ. చెలమయమంత్రిపుత్ర ! సరసీజశరోపమగాత్ర ! నీరజా
తలసితనేత్ర ! సర్వజనతానుతిపాత్ర ! కవీంద్రదక్షిణా
నిలశిశుచైత్ర ! దావజితనీరజబాంధవపుత్ర ! రాజతా
చలహారహీరకాళపితసారసకల్యయశోధురంధరా ! 113

కవిరాజవిరాజితము.

లలితసుహృత్కవిబంధుయుతామితలక్షణలక్షితచిత్రితకం
బలయుతదివ్యసభాభవనాంతరపౌరరసప్రసరత్కవిమం
డలకవితామృతసంతతపానమనఃప్రియకారకభాషణకో
మలతరవర్తన ! తోషితబాంధవ ! మంత్రిశిఖామణి ! ధీరమణీ !

— గద్య —

ఇది....శ్రీ తిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబైన
కేవలకల్పితంబగు శ్రవణానందంబను మహా
ప్రబంధమునందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీ రస్తు

శ్రీమత్పరదేవతాయైనమః

# శ్రవణానందము

## ద్వితీయాశ్వాసము

క. పంకేజాతవిలోచన
పంకరుహభవాదివినతపదకుక్కుటరూ
పాంకితశంకరకింకర !
వేంకటరత్నప్రధాన ! విశ్వజనీనా ! 1

తే. గీ. అవధరింపు మనంతరం బతని సుచిత
పీఠమం దుండఁగాఁ జేసి విశ్వమాత
భక్తి దళుకొత్త మిగులఁ బ్రపత్తి దనర
నిట్టులనియెను గౌరవం బుట్టిపడఁగ. 2

తే. గీ. వైష్ణవోత్తమ ! మీ పాదపద్మరజము
వలన మాయిల్లు పావనత్వంబు నందె
ధన్యనైతిని మాకన్య ధన్యయయ్యె
నెన్నియో మంగళము లబ్బు నింక మాకు. 3

ఉ. దాసజనప్రసన్నుఁడగు తామరసాక్షుని దాసులైన మీ
దాసులకుస్ దదంఘ్రియుగదాసులకుం దదధీనవృత్తితో
దాసులకుం దదీయపదదాసులకుం గడుదాసురాల వి
శ్వాసము గల్గువారలకు వైష్ణవులే కద ? రంగనాయకుల్. 4

తే. గీ. చిన్నతనమున మాయింటి కెన్నఁడేని
స్నేహితులఁ గూడి మీరు విచ్చేయుచుండ్రి
నాలుగైదేండ్లనుండి యెన్నఁడును రారు
దాసి తరియించునట్టి విధం బిఁకెట్లు ? 5

వ. అని వినయమ్మునం బల్కునజ్జరఠవేశ్య కయ్యాచార్యుం డిట్లనియె. 6

ఉ. వచ్చుట కేమిగాని పయివారలు చూచిన లేనిపోని పె
న్మచ్చలు పన్ని "యాతని గుణమ్ములు మంచివి గా" వటంచుఁ దా
రచ్చటనచ్చటం బలికి యల్లరి సేతురు; లోకు లన్న బల్
బ్రుచ్చులు సత్యమెన్నుదురె? లోకము మాయను మూఁకు దున్నదే?

ఉ. ఇంతకుఁదప్ప వేఱొకటి యేదియు లే దిఁక సందియంబు కా
సంత యటన్న; వృద్ధ యను "నయ్యది సత్యమె లోకు లైనవా
రెంతటివారినైన నిటు లెంచుదు రైనను వారివల్ల నా
వంతయు మీకుఁ గార్యమనువట్టిది లేదుగదా! తలంపఁగన్. 8

ఉ. నిప్పున కంటునే చెదలు? నీరజమిత్రునిపై కంటునే తమం?
బెప్పటికైన మీరలిటు లేటికి సందియ మందుచుండ్రు? రో
యప్పా! రమానివాసువిదయన్ ధమ రెంతటివారలైననున్
దప్పునె? దాసరాంఘ్రిపయిఁ దప్పులు వట్టక యాదరించుటల్." 9

వ. ఇ ట్లుచితాలాపమ్ములం బొద్దుఁ బుచ్చుచున్నంత. 10

సీ. ముంగాల సింగారముం గార మేలు బం
గారు రంగారు లంగా ధరించి
దబ్బకాయలఁ జూచి యబ్బగారని పిల్చు
గబ్బి గుబ్బలఁ గంచుకమ్ము దొడిగి
చందమామ మిటారమొందు మోమున గంగ
సిందూరనామంబుఁ బొందుపఱచి
కలువరేకులజాలు గెలువఁజాలెడి సోగ
చెలువు కందోయిఁ గజ్జలము దీర్చి
తే. గీ. లీలఁ గీల్జడఁ జుట్టి చౌల్లెమ్ము వెట్టి
లలితరుచి నొప్పుచున్న బులాకితోడ
మించి ముసిముసినగవులు మేలమాడ
విప్రుదరిఁ జేరె నప్పు డవ్వేశ్యతనయ. 11

ఉ. పైఁట దొలంగి పాదములపైఁబడ గాజులు మ్రోఁయ సర్వదే
శాటనపావనంబగు ధరామరుపాదసరోజయుగ్మ మా
బోటి నమస్కరించె నలపుష్పశరాసుఁడు బాణపఙ్క్తికిన్
వాటము గాక తా గిరటమై చినచాప మనంగ నత్తఱిన్. 12

వ. ఇట్లు నమస్కరించినఁ దగుగతి మంగళాశాసనం బొనర్చి చనుట
కుద్యుక్తుండగు నక్కవివర్యుం జూచి వృద్ధ యిట్లనియె. 13

క. అమ్మా! మన యయగారికి
నిమ్మా! తాంబూల మింటి కేఁగెదరఁట వే
పొమ్మ కొనిరమ్ము మన పు
ణ్యమ్మున వారిటకు వచ్చినారు గదమ్మా! 14

సీ. అయగారి దర్శనం బాచరింపఁగవలె
నంచు నెంతయుఁ గుతూహలముతోడఁ
బల్కుచుందువు నీవు కల్కిరో! యెన్నాళ్ళ
నోయుండి వార లీయూరిలోన
దయచేసి యుండియు ధయచేయ రెన్నఁడు
మనయింటి కటువంటి మాన్యు లిపుడు
దయచేసినారు తద్దయు నీదు సుకృతంబు
ఫలియించె నీనోము పండె నమ్మ!

తే. గీ. వారితో మాట లాడ కీవయసు నీవు
సిగ్గుగైకొని తలవంచు టెగ్గుగాదె!
వార లేమనుకొందు రీవయసుఁ జూచి?
యన్యులా? వారు మనకుఁ బద్మాయతాక్షి! 15

వ. అని తల్లి పల్కుటయు. 16

ఉ. చేతను బళ్లెరంబుఁ గొని సిగ్గొకకొంచెము వెన్కలాగఁగా
వాతెఱయందుఁ జిర్నగవు వాళ్ళఁబంతము లాడుచుండ మే

ల్మూఁతల గుబ్బలన్ బయఁటలోపల డాఁగురుమూఁతలాడఁగా
నాతని దగ్గరెన్ వికసితాంబుజలోచన గుంచె ఝుల్లనన్. 17

ఉ. "ఇచ్చిన నిప్పుడే వెడలు నీయన, నీయక యిట్టు లెంత సే
పిచ్చటఁ గాలయాపనము సేనొసరింతు" నటంచు నెంచుచున్
ముచ్చట వెన్కకున్ మఱియు ముందఱికిన్ దిగలాగఁ గొంతసే
పచ్చపలాక్షి యూరకొనె; నట్లగుఁగా మది మోహముండినన్ ॥ 18

సీ. కరము కంపము నొంద సరులు తల్లడమందఁ
జెమటచేతను జెక్కు చెమ్మగిల్లఁ
గనులు చాపలమూన మనము గోరికలూనఁ
దనువు పులకలచే దళముగాఁగ
నవ్వు అవ్వకుఁదీయ అవ్వ చివ్వునఁదాయఁ
జనులు గందరగోళ మనుసరింప
సిగ్గు వెన్కడుగేయఁ జేటు ముందడుగేయ
మోహమ్ము తలకెక్కి మురువుఁజూపఁ

తే. గీ. బళ్లెరము బల్లమీఁదను మెల్ల నువిచి
తమలపాకులు దీసి హస్తమునఁ బూని
పొలఁతి తాంబూల మిచ్చునప్పు డొకవింతఁ
జేసె నావింత యేమని చెప్పవచ్చు? 19

వ. ఇట్లు తాంబూలం బొసంగిన గ్రహించి చన నుద్యుక్తుం డగు నమ్మధు
సూదనున కవ్వేశ్యమాత మరల నిట్లనియె. 20

తే. గీ. తప్పుగాఁ జూడరేని నే నిప్ప డొక్క
మనవిఁ జేసెద; దేవర మనవి చిత్త
గింపవలెఁ దప్పయిన క్షమియింపవలయు
దాసరుల తప్పు దండముతో సరికద. 21

తే. గీ. వర్ణములలోన వృత్తిని బట్టిచూడ
మాకులం బెంతకేనియుఁ గాకులంబు

"తగిన యన్నంబులోనికిఁ దగినకూర
దొరక" దనుసామెతకు మేమె గుఱుతుసుండి. 22

మ. ధనమా ? లోపములేదు; విద్యయును మీదాస్యమ్మునంజేసి కై
కొనె నీ కన్నియ, రూపురేఖలకుఁ దక్కంగల్గు మావారిలోఁ
గనుగీపై తగు హెచ్చుతగ్గు, గడుపేదన్ సాటి రోటోట్లరీ
తిని వర్తింపఁగఁ జేయకుండుటకు నెంతే నెంతు స్వాంతంబునన్. 23

ఉ. పుట్టిననాఁటనుండి ధనమున్ గడియించుట కిచ్చలేదు నా
కెట్టులనైనఁ గాని ఘనులెల్లరు మెచ్చుటయే ధనంబు పీః
పొట్టకునై కదయ్య ? పలుపోకలు పోవుట, ధాత పెట్టఁడే
పట్టెఁడుకూడు ? నన్నము నెపమ్మునఁ జచ్చినవార లుండిరే ? 24

ఉ. ఏదెసనైన సత్పురుషు లెల్లరు మెచ్చెడి సత్ప్రవర్తనం
బూఁది క్రమపరికారమున నుత్తమసమ్మతిగా ధనంబు సం
పాదనఁ జేయు టొప్పగును; మాన్యులు మెచ్చనిద్రవ్య మేల ? పా
కీది గడింపదే ధనము; కీర్తికిరాని ధనంబు కాల్పనే ? 25

శా. ఏనే కాదు మదీయమైన కులమున్ దెన్నో తరాలాయెఁగా
నీ నీచున్ వినఁబోరు, చూడరు; ధనం బీసీ ధనం బీయకే
పోనీ బ్రాహ్మణజాతిఁ దక్క నితరున్ భోగింపఁగాఁబోరు; కా
దేనిన్ క్షత్రియజాతి, యన్యము 'ముదారే' మాకుఁ జర్చింపఁగన్. 26

ఉ. కాసుల నిత్తుమంచు నరకాసుల నిత్తుమటంచు వత్సర
గ్రాసమువచ్చు భూముల నొకానొక విద్రకె యిత్తుమంచు నా
యీ మత నెల్లవారడుగ, నేమొకొ ? నామన మిచ్చగింప; దే
దోసమొ కాని నా తనయతోడు సుఁడీ ! యన్నృతమ్ములాడినన్. 27

ఉ. అందఱు కన్నివంకలను నల్లుచునుండుపెకాని యెవ్వనిం
బొందుట కిచ్చగింప; దదెపో, యని యేమను నూరకుండు; మీ
యందునమాత్ర మిచ్చ గల దంచును సూచనఁ జేయుచుండు; నే
"నందనిమ్రానిపం డిది" యటందును; దా "నది కాదు కా" దనున్.

తే. గీ. కాన దీవిని మీదాసిగా నొనర్చి
సంతసము పెరుపూళ్ళకు సంఘటింతు
భాగవతులకై ంకర్యంబు భగవదధిక
సమ్మతం బని కాదె ? వైష్ణవమతంబు. 29

వ. అన నయ్యాచార్యకవివరుం డద్దాని కిట్లనియె. 30

ఉ. కోరినమాట మంచిదియె కోరఁగవచ్చును గోరనంతనే
నేరము గల్గునే ? వినుము నీదగుమాటకు నుత్తరంబు నీ
కోరిక లేకయే జగతిఁ గోరెడివారలు వేనవేలు నీ
వారసికాగ్రగణ్యులకు నర్పణ సేయుము నీదుపుత్రికన్. 31

క. రసికతయన నెట్టిదియో
యిసుమంతయు మాకు సున్న, యటువంటి ప్రసూత్
రసికులవి; మేమయినచో
రసహీనము మఱియు నిహపరమ్ముల వెలియున్. 32

చ. పర మటులుండఁగా వినుము భామిని ! "తానఁట, సత్కవీశ్వరో
త్తరుఁడఁట, మంచిచెడ్డల విధమ్ము సమస్త మెఱుంగునట్టి ధీ
వరుఁడఁట, వేశ్యకన్యకకు వల్లభుఁడౌనఁట, యెంతవింతయో !
హరిహరి" యంచు లోకులను నాయపకీర్తికిఁ దాళఁజెల్లునే ? 33

క. "ఎవరికినిఁ దెలియ" దంచును
నవరణఁ జేయకుము; పిల్లి చయ్యనఁ దన క
న్గవ మూసి పాలుద్రావిన
నెవరికిఁ దెలియకయ యుండునే ? కనుఁగొనుమీ, 34

తే. గీ. అన్నియు నెఱుంగుపోఁడవే యగుదు వైనఁ
గాని యొక్కటివినుము నిక్కము గు మాట
ఎట్టి సంగతులైనను నిముడుఁగాని
జారచోరత్వములు దాఁగఁజాల వెందు. 35

తే. గీ. మఱి యిఁకేమన్న, నింకొకమాట వినుము
ఎట్టివాఁడైన వెలయాలి నెనసెనేని
యశము గంగనుబడు నపయశమువచ్చుఁ
గాన మాబోఁట్లకిది మంచిగాదు నిజము. 36

క. అని పలుకుచున్న విప్రునిఁ
గని "యీగతి మీరు పలుకఁగా నగునె, యశం
బున కేమిలోప మబ్బును ?
కనమే మును కవులయొక్క కతలు మహాత్మా ? 37

సీ. ధనకామినీమణీజనలోలుఁ డైనట్టి
కాళిదాసున కేమి ఘనత దరిగెఁ ?
జింతామణీవారకాంతాయుతుం డైన
లీలాశుకున కేమి లీల దగ్గె ?
విధివిరామములేక వేశ్యకాంతలఁగూడు
శ్రీనాథకవి కేమి చేటు మూఁడె ?
వి త్తకాంతాధరాయ త్తచిత్తుండైన
ధూర్జటికవి కేమి దోస మబ్బె ?
తే. గీ. గ్రంథములయందుఁ దాము శ్రీరంగనీతు
లెన్నియో చెప్పుదురుగాని యెంచిచూడ
వారకాంతలఁ దగవన్నివారు లేరు
కవులసంగతి నే నెఱుంగనిదికాదు. 38

వ. అదియునుంగాక విశిష్టాద్వైతసిద్ధాంతవిరుద్ధం బంటిరేని. 39

క. "అధియ" నని కోరుచున్న
ప్పుడు కాదనఁబోరు వైష్ణవులు; తొండరడి
పొడియాళ్వారొక మా వెల
పడఁతిం గొనె; బ్రహ్మరథము పట్టిరె ? జియ్యల్. 40

క. రసభరితములగు కావ్యము
లసమానమ్ముగ నొనర్చి యఖిలజనులకున్

రసికత నొసఁగు సుకవులే
రసికులు గా రనుచు మూర్ఖురాలికిఁ జెప్పఁడీ. 41

తే. గీ. సిద్ధమయినట్టి యన్నంబుఁ జేతి కంది
నట్టి పరిపక్వఫలమును, నంగనామ
ణీప్రథమయౌవనమును బండితు లుపేక్ష
సేయఁగా రాదుచేసినఁ జెడును మీఁద. 42

వ. అదియునుంగాక. 43

క. "భూదానము కన్యా వి
ద్యాదానమ్ములు పరిగ్రహణయోగ్యమ్ముల్
గాఁ దెలియఁజెప్పుదురు మీ
భూదేవతలే" యటన్న భూసురుఁ డనియెన్. 44

క. కులమును దెలివియుఁ దేటయుఁ
గలకులయెడ ముందుఁ జూడఁగావలె నందుం
గులము ప్రధానమ్మగు నది
కలియనిచో దానిఁ బొందఁగారాదు కదా! 45

తే. గీ. కాళిదాసాదికవులసంగతికి మాకు
హస్తిమశకాంతరంబగు నది యటుండ
వార లొనరించినట్టి సద్వర్తనములు
చేయవచ్చును జెడ్డలు చేయరాదు. 46

క. కవులకుఁ గలిగినరసికత
కవనమునం దుపచరింపఁగా యోగ్యతరం
బవుఁగాక కులవిహీనలఁ
గవయుటకా? యన్న వృద్ధ కనలుచుఁ బలికెన్. 47

క. కులభేద మెన్నఁగూడదు;
తెలివియుఁ దేటయును గల్గు తెఱవలయెడ నీ

యిలలో "స్త్రీరత్నం దు
ష్కులాదపి" యనంగ వినమె? సూరివరేణ్యా! 48

క. "ఏజాతివారిఁ గూడిన
నాజాతియె యగును వేశ్య" యంచును విద్వ
ద్రాజులు వచించుమాటల
నే జూటామాట లనుచు నెంచితిరి గదా? 49

వ. అనిన నద్దానియు క్తినై పుణ్యమ్మున కచ్చెరువడి మాటలచే సంతోషపెట్టి
చనువాఁడై చిఱునవ్వు నవ్వుచు నాతం డిట్లనియె. 50

తే. గీ. యోగమున్నను దప్పింప నొకరివశమె?
యుక్తిపై యుక్తులకు నంతముండదు గద?
మహి వినుటలేదె "మాటకు మాట తెవులు
నీళ్ళకును నాచుతెవు" లను నీతిరీతి. 51

క. అని పలికి ప్రొద్దుపోయిన
దనియును రేపకడ వత్తుననియును నవ్వే
శ్యను నొప్పఁజేసి చనె నా
తనిగృహమున కతఁడు శంకితస్వాంతుండై. 52

వ. అట్లు చని యాతండు తనమనమ్మున, 53

తే. గీ. నిదురఁబోఁగొట్టుఁ, గ్రమముగా నెత్తికెక్కుఁ,
గలుషతఘటించుఁ గుండయుఁ గట్టుయుఁ దన
చేతి కొనఁగూర్చు నదిగానఁ జెప్పనగునె
వేశ్యకును నస్యమునకును భేదమిలను? 54

ఉ. రాగములేకయే పయికి రాగముగల్గినరీతిఁ జూపుచున్
రోగముగల్గియున్ బయికి రోగములేదని బొంకులాడుచున్
సాగినయంతవట్టుఁ గడుఁ జల్లఁగ ద్రవ్యము దోచిపుచ్చు నీ
భోగముజాతి నమ్మ్మటలు పోలవుగా! భువి నెంతవెట్టికిన్. 55

సీ. మాయమాటలకు నమ్మకమైన వ్యాఖ్యాత
తులలేని పచ్చిబూతులకు బుంగ
యనుచితవ్యాపారమునకుఁ బెట్టినపేరు
స్తుతిపాఠవాక్యసంతతికి వందిఁ
పరమనోభిప్రాయహరణమ్మునకు నద్దు
మనృతవాక్యముల కిమ్మైనకొంప
తనయానువిరచితావినయమ్ములకు ఛత్రి
మఖిలదోషములకు నాలయంబు

తే. గీ. బెట్టుసరిమాటలకు నెల్లఁ బుట్టినిల్లు
నిఖిలధనసంతతులకు శనిగ్రహంబు
వెనుకముందును దెలియని వెఱ్ఱివెఱ్ఱి
విటులపాలిటి యమదూత వేశ్యమాత. 56

ఉ. కావున వేశ్యమాత లనఁగా మటుమాయలమారిముండ; లి
ప్లేవగ నైన లాలనము లిచ్చకముల్ పయిపూఁత కూరుముల్
కేవల సత్యరీతిగను గిల్కొనఁజేసి ధనమ్ముదోచు; రీ
తోవ లెఱుంగమే; బుధులతోడను సాగునె? యట్టివేషముల్. 57

ఉ. జారసఖిన్ ధనాంగనను జారునిఁ జోరునిఁ ద్రాగుఁబోతు నె
వ్వారును గీర్తి కాసపడువారలు కొంపకుఁజేర్పరాదు; త
ద్ద్వారముఁ గార్యముండినను దాముసు ద్రొక్కఁగరాదు; విక్క మీ
తీరు పెఱుంగకున్నఁ గొవితేవలెనే? యపకీర్తి యేరికిన్. 58

ఉ. కావున నిట్టిసంగతులు గౌరవహీనులపెట్టెసొమ్ము లీ
త్రోవలు మంచిపూరుషులు ద్రొక్కరు, త్రొక్కినవారి మెచ్చ, రీ
త్రోవలఁ గాలుపెట్టిననరుండు మహాత్ముఁడు; కాలుపెట్టినా,
కేవల నిందితుండు నపకీర్తిపతీమణికిం బ్రియుండునౌ. 59

సీ. కొండమాచార్యపుత్రుండు రామామణి
వెనసి విర్భాగ్యుఁడై చనఁగలేదొ

నీలకంఠావధానికుమారుఁ డలచంద్రి
ముఖిఁగూడి మాన్య మ్మమ్ముకొనలేదొ
హనుమంతరావు చేకొనినదత్తుఁడు సుంద
రినిఁగూడి కొంపమ్ముకొనఁగలేదొ
అల్లకృష్ణయమంత్రియనుజుండు మణిమాల
తోఁగూడి ముష్టి యెత్తుకొనలేదొ

తే. గీ. వీరలొకలెక్కయే! జమీందారు లెంద
ఱెంద అప్పులపాలగు టెఱుఁగఁబడదు?
అమరుఁగాక హిరణ్యశృంగములు తనకు
వెలవెలఁదిపొందు పలుకష్టములకు మిందు. 60

క. అని మనమున ననుకొని జరి
గినసంగతివలన వెట్టికీర్తిగలుగునో
యని సంశయించె నాతఁడు
ఘనులకు నపవాదకన్నఁ గష్టము గలదే? 61

తే. గీ. మనము చెడకున్న కతన నమ్మదనుఁ డతని
యింటిపంచకునైనను నేగకుండె;
మనము చెడఁగొట్టుకొన్న యమ్మగువమిన్న
దాపునను గాఁపురముపెట్టె దర్పకుండు. 62

తే. గీ. అంతఁ గొన్నిదినంబుల కఖిలజనుల
కపరిమితమోదదాయకంబై తనర్చె
సంతతామోదభారవిశాలసహర
సాల కీలితమగుచు వసంతఋతువు. 63

తే. గీ. "ఇంట సతులను డించి యిట్లుంట మీకుఁ
బరువు గా" దని ప్రోషితభర్తృకలగు
వారిపక్షము వహించి పాంథజనులఁ
గూఁకలిడె నసఁ గోకిలతతి కూఁత లిడియె. 64

సీ. అత్తతోఁ బోరాట మంది పోయినయట్టి
జామాత తనుఁదాన సఖ్యపడియె
భార్యతోడ విరోధపడి పోయినమగండు
మగుడ భార్యను బ్రతిమాలుకొనియె
సన్యసించుటకు నిశ్చయ మందినవిరాగి
రాగాంధుఁడై తన రమణిఁ గవిసెఁ
గార్యార్థమై దూరగతుఁడైన సంసారి
తత్తఱమ్మున మారిదారి పట్టె
తే. గీ. బ్రహ్మచారులు పెండ్లికై పాట్లఁ బడిరి
వేశ్యమాతలతోడను విగ్రహించి
నట్టి విటులెల్ల వద్దాని నమపరించి
రహహ ! యేమందు తద్వసంతాగమమున. 65

సీ. చిన్నారి పొన్నారి చిఱుతప్రాయపు వధూ
వరుల వివాహముల్ నెఱపువారు
వచ్చియు రావి గుబ్బలకుల్కు గల గుబ్బె
తలకు శోభనములు సలుపువారు
ముడివేయుటకు దడావడిసిగల్ గల కుఱ్ఱ
లకు నుపనయనముల్ జరపువారుఁ
గ్రొత్తక్రొత్తగఁ గట్టుకొనిన లోగిండ్ల గృ
హప్రవేశమ్ముల నందువారు
తే. గీ. స్వామికళ్యాణ మహములు సలుపువారు
గ్రామదేవత జాతరల్ గడపువారు
లలి వసంతోత్సవమ్ముల నలరువారు
నైరి ప్రజలెల్ల నవ్వసంతాగమమున. 66

వ. ఇట్లు వసంతఋతువు చెలంగువేళ నొక్కనాఁ డమ్మధుసూదనుండు సాయాహ్నంబున శీతవాతపోతనిషేవణమ్మునకై యంతికోద్యానమ్ము

నకుం జని యచట సుధాసైకతవిలేపనస్వచ్ఛం బగు నొక్కచప్పరం
బధిష్ఠించి తదారామరామణీయకంబు విలోకించుచు వికసితాంతరం
గుఁడై యున్నంతఁ దదుదంతంబు నొకచెలిమిన్న తదీయవివిక్తసంద
ర్శనాభిలాషిణి యగునబ్బాలామణికిఁ జెప్పిన నప్పద్మాక్షియు. 67

సీ. తన నవ్వుకన్నఁ జక్కనితెల్పుగల చల్వ
కండువా బుజముచక్కటి నటింపఁ
దనమేనికన్న మెత్తని క్రొత్తమల్లెపూ
వులు వేణినుండి జలజలని రాలఁ
దనకాంతికన్న హెచ్చున నొప్పుబంగారు
మొలనూలు కటిమీఁద మొనసియాడఁ
దన మోవికన్న నెఱ్ఱనిరంగుగల గాగ
రా పదమ్ములమీఁద రంగు లీన

తే. గీ. వలపు చిగురింపఁ గోర్కెలు దొలకరింప
మనము బెనఁగొన సందియం బినుమడింప
నతనిఁ గనుఁగొనువేడుక లలవరింపఁ
దత్క్షణమయేగె నంతికోద్యానమునకు. 68

వ. ఇట్లు చని దౌదవ్వుల నాతనిం గాంచి సమీపమ్మునకుం జన సంశ
యించుచున్నంత. 69

సీ. బలుపసందుగ నొప్పు పైఠిణీ తైకపైఁ
బైఁటలో హారముల్ నీటుఁజూప
మలఁచినట్లున్న దండలఁ గ్రిక్కిఱిసి దండ
కడియమ్ము లొకవింతకాంతి నీన
మురుపుఁ జూపెడి ముద్దుమోవిపైఁ బ్రసరించు
తళ్కుముత్తెము తళత్తళ నటింప
భ్రమపుట్టఁజేయు పాదముల నొప్పెడినూపు
రధ్వనుల్ గతికి సారస్య మొసఁగ

తే. గీ. నెనక మెఱుఁగంగఁ గాంతి నద్దెపఁ జెలంగ
ముసిముసినగవు మొగమున మొలకలెత్త
నల్లనల్లనఁ దనకడ కరుగుదెంచు
సుందరినిఁ గనె నమ్మధుసూదనుండు. 70

వ. ఇట్లు గాంచి తదాగమనమ్మున కచ్చెరువడి యచ్చెలి కిట్లనియె. 71

తే. గీ. ప్రొద్దుగ్రుంకెను జీఁకటుల్ పొసఁగనాయెఁ
బొలుపుమీఱఁగ భూషణభూషితాంగి
వగుచుఁ దో డింతలేక యుద్యానమునకు
నేల వచ్చితి? ప్రనిఁబూని బాలసాని! 72

వ. అనుచు నొక్కింత స్మితపూర్వకమ్ముగ నడిగిన నక్కన్నెమిన్న యిట్లనియె. 73

ఉ. వెండియు రేపె వత్తుమని వేగిరపాటున గంటయైనఁ గూ
ర్చుండక యల్లనాఁడు పని యున్నదటంచును నేగి మీరు రా
కుండుటఁజేసి మిమ్ముఁగన నొయ్యన నొంటిగ నేగుదెంచితిం;
బండితులైనవారల కబద్ధము లాడుట భావ్యమే కదా! 74

తే. గీ. నాఁడు మాయమ్మతోడ మీ రాడుయుక్తు
లకు సముత్తరములు చెప్పుటకు నొకింత
దలఁచియును మిన్నకుంటి మాతల్లిఁ జూచి,
వెలవెలందుల పొం దంత వెక్కసంబె? 75

చ. కలయుట తప్పటంచుఁ బలుకం దగునే? మఱి వేశ్యకాంతలం
గలయుటలేదె? బ్రాహ్మణులు, గానమె వారల, నన్యకాంతలం
గలయుట తప్పుగాని వెలకాంతలఁ గూడుట తప్పు గాదు; తా
"వలచిన మేనమామసుత వావియ కా" దని యందు రేమొకో! 76

క. కులకాంతతోడఁ గూడినఁ
గలదే మఱి తప్పిదంబు? గనుఁగొనుఁడి మదిన్
గులకాంతయు వెలకాంతయు
నిలలో నొకతీరువారలే మనుజునకున్. 77

ఉ. పాపమటంచుఁ బల్కితిరి పంచశిలీముఖబాణసంభవ
త్తాపముచేత బాధపడుతన్వి ననాదరణంబొనర్చు నా
పాపముకన్న నన్యమగు పాపము లెక్కడె; యట్టిపాపమున్
బాపెడిపుణ్యు లీ చిఱుతపాపము గీపము లెక్కచేతురే? 78

సీ. సంపెంగఁ బోలుపుష్పము గల్గునే? యొక్క
తేఁటి కయ్యది వెనుపోటు గాక
తుహినాంశుఁ బోలువస్తువుగల్గునే? పద్మ
తతులకు నైధనతార గాక
మొగలిఁ బోలెడి దఃమ్ములు గల్గునే? కాల
గళునకు షష్ఠాష్టకంబు గాక
గానమ్మువంటిసత్కల గల్గునే? వేద
విదుల కయ్యదియుఁ జుక్కెదురు గాక

తే. గీ. వలచి వలపింపఁగల్గిన వారముఖ్య
వంటి వగలాఁడి గల్గునే? వనితలందుఁ
దమమదికి వేఱురీతిగాఁ దట్టఁగాక!
భూమిసురరాజ! కవితాసతీమనోజ!

సీ. పండితపామరాపారమోదదము గా
నమ్మ మాపెట్టెలో సొమ్ముగాదె?
శుభకార్యములయందు సొంపు సంపాదించు
విధి మేము పెట్టినభిక్ష గాదె?
మన్మథవేదాంతమార్గోపదేశము
లనఁగ మా తలనె పుట్టినవి కావె?
మునిభీతిలో మునిఁగిన రాజుమద్ధరిం
పఁగ మమ్ముఁ జెప్పి చెప్పవలెఁ గాదె?

తే. గీ. సురతనైపుణ్యముల మదిఁ జొన్పురసిక
వరుల కందఱు మాతరువాతఁ గాదె?

ఎన్నివిధములఁ జూచిన మన్ననలకుఁ
దగుదుమేకాని నిందకుఁ దగము మేము. 80

సీ. కామాగమాఖ్యాసకలన మీకుఁ గవీంద్ర!
కామాగమాఖ్యాసకలన మాకుఁ
దత్తదంగస్ఫూర్తిమత్త మీకుఁ గవీంద్ర!
తత్తదంగస్ఫూర్తిమత్తమాకు
నవరసాలంకరణరతి మీకుఁ గవీంద్ర!
నవరసాలంకరణరతి మాకు
ససుమనస్సామోదశయ్య మీకుఁ గవీంద్ర!
ససుమనస్సామోదశయ్య మాకుఁ
తే. గీ. బరవశవిధానకౌశలపటిమ మీకుఁ
బరవశవిధానకౌశలపటిమ మాకుఁ
గాన మీకును మాకు నైక్యంబు తప్పు
గాదు; వివరించి చూడు మో కవివరేణ్య! 81

సీ. సరసపద్యవిశేషసక్తి మీకుఁ గవీంద్ర!
సరసపదవిశేషసక్తి మాకుఁ
జిత్రబంధశ్లేషసిద్ధి మీకుఁ గవీంద్ర!
చిత్రబంధాశ్లేషసిద్ధి మాకు
శుచికులోదయకృతస్ఫూర్తిమీకుఁ గవీంద్ర!
శుచికలోదయకృతస్ఫూర్తి మాకు
అభినవపాండిత్యవిభుత మీకుఁ గవీంద్ర!
యభినయ పాండిత్య విభుత మాకు
తే. గీ. నన్నిటను మీకు మాకును నరసిచూడఁ
దౌల్యమేగాని వర్ణభేద మొకఁ డుండె
నింతమాత్రము భేద మదేరికైనఁ
గలదని యెఱుంగరే? మీరు కవులుగారె? 82

వ. అదియునుం గాక. 83

చ. అతికఠినప్రయాసమున నార్జనఁ జేసిన కామశాస్త్ర మే
గతిఁ జరితార్థమౌను ? కులకాంతలయం దదిగూడ దంచు నా
రతికలయే వచించుఁ; బరరామల కంతటికాల మబ్బునే ?
వెత యగుఁగాదె ? లక్షణవివేకము లక్ష్య మెఱుంగకుండినన్. 84

తే. గీ. అనుచు నొకమాట కొకమాట కతుకకుండఁ
బల్కె, దరహాస మొనరించుఁ, బైఁట జార్చు,
మనములోఁగోర్కె వెలిఁజేయుమనుచు మరుఁడు
ప్రేరణముసేయ నాపఁగా నేరితరము ? 85

వ. అను నబ్బాలామణి సయుక్తికమ్ములగు వచనమ్ములకు సంతసింపుచు
నతం డద్దాని కిట్లనియె. 86

ఉ. ఎన్నఁడు నేర్చి తీ వగల ? నెన్నఁడు నేర్చితి విన్నిమాటలన్ ?
మొన్నటిదాన వీవు సరిపో ! యిపు డెంతటిదానవైతి ? నిన్
బిన్నటినాఁడెఱుంగుదును "బెప్పెపె మెమ్మెమె" యంచు నుండు వీ
వెన్నిట జాణవైతి; విపు డెవ్వనినైనను బుట్టఁబెట్టవే ! 87

వ. అని పలికి.

సీ. రమణీమణీవిహార మెఱుంగనట్టిధీ
వరుఁడౌటచే మది గరఁగ లేదొ
ధనకామినీమణీజనతత్పరత మంచి
కాదనియే మది గరఁగ లేదొ
క్షణసుఖమ్మనకు యశమ్ము గంగను గల్పఁ
గా రాదనియె మది గరఁగ లేదొ
మనమీఁది తాత్పర్యమా వెలచెలి? కిట్టి
దరుదనియే మది గరఁగ లేదొ

తే. గీ. కాని యక్కన్నెమిన్నకు లోనుగాక
చనియెఁ దనయింటి కాతఁ డవ్వనము విడిచి;
క్రమముగాఁ గాని యింతమాత్రమున కట్టి
ఘనులబుద్ధులు పెడమార్గమునకుఁ జనునె ! 89

తే. గీ. అతనిహృదయవిధంబు దా నరయకునికి
సిగ్గిలుచు న త్తలోదరి చింతగొనుచు
నాతఁ డేగినమార్గమ్ము నరసికొనుచు
నింటి కేతెంచెఁ జిన్నవోయినవిధమున. 90

క. దొరకక దొరకక సమయము
దొరకినఁ బైఁబడక నే మృదువచనములచేఁ
గరఁగింప నెంచ నగునే!
కరఁగునె? ని ప్పంచుఁ జెప్పఁగా ఘృత మకటా! 91

క. అని యీగతిఁ దనమనమునఁ
దనివారని కోర్కులతలు దట్టములై మే
కొనఁగ నిలుపోపమిని గడుఁ
గనికర మగురీతి దోఁపఁగా నున్నయెడన్. 92

చ. కనుఁగొని తల్లి యిట్లను "సుఖమ్ముగ నుండఁగ లేక వెఱ్ఱిరీ
తిని నిటు గుంద నేటికి మదిం? గలవా? ధరణీతలమ్మునం
దున విటశేఖరుల్ పదులు నూఱులు వేలును లక్షలుం, ధనాం
గన లిటు వెఱ్ఱిఁ బూనుదురె? కాదనరే? పరివారు విన్నచోన్. 93

ఉ. రమ్మనినంతమాత్రనె కర మ్మనురాగము మీఱ వచ్చువా
రిమ్మహి వేనవేలు గల; రిట్టి విటాగ్రణులం ద్యజించి నీ
విమ్మహిదేవసూను నలయింపఁగ నేటికి? రానివారలన్
రమ్మని పిల్వ వేడు కనరా? పరివారలు నవ్వకుందురా? 94

చ. జనుల కనేకమార్గముల సంపద లేర్పడియుండెఁ గాని యౌ
వనమె ధనమ్ముగా మనకు వారిజసంభవుఁ డిచ్చె; నిట్టియౌ
వనమున లేనిపోనివలవంతలఁ గాలము వెళ్ళఁబుత్తురే?
చినిఁగినచీర నమ్మకముఁ జేసినఁ గొందురె? యెట్టివెఱ్ఱులున్. 95

సీ. చిన్నదా, పెద్దదా? చెప్పునీకన్న మా
ణిక్యము వేవేల్ గణించి పోసె

మొదటి కన్నెఱికమ్ము తుదముట్టెనో, లేదా
మీనాక్షి గట్టించు మేడఁ జూచు
నీకన్న వన్నెచిన్నెలు గల్గెనే ? కాంతి
యొడలెల్ల బంగారుతొడవులాయె
నందమా, చందమా ? యది యదృష్టమెకాక
యలివేణి యెంతపూన్యము గడించె

తే. గీ. నేఁటి కేఁడాది యాయె నీ కీడువచ్చి
గవ్వమైనను నీవల్ల గడన యెఱుఁగఁ
బాడి చెప్పిన నీకుఁ గోపమ్మువచ్చుఁ
గష్టసుఖములు నీ వెఱుంగవు గదమ్మ ? 96

సీ చక్కెర విల్కానిసామ్రాజ్యలక్ష్మినాఁ
బ్రొక్కనున్నప్డు చూపట్టవలదె ?
కేళికారీతిఁ జొక్కించువేళలను జం
త్రపుబొమ్మపోల్కెఁ గన్పట్టవలదె ?
ఎదురుగాఁ దోతెంచునెడ విలాసంపుసం
పదల బ్రోవనఁగఁ జూపట్ట వలదె ?
రతి పెంచుకొన్న గారంపుకీరంబునా
భాషించునప్డు గన్పట్ట వలదె ?

తే. గీ. విటుల మోహింపఁ జేసెడి వేళలందు
మచ్చుమందుల బొమ్మనా మసల వలదె ?
సాని సాని యనంగనే సంబరంబె,
వేయిరీతులదాని సంసారి యవరె ! 97

శా. ఏమెవ్వానికినైనఁ గాని హృదయం బీరాము వాఁ డట్టివాఁ
డే యౌఁ గాక; యొకం డటంచు మన కేమీ, సూత్రముం గట్టెనే ?
బోయీవానికి నొక్కఁడే ప్రభువఁటే, బోగాల కొక్కం డఁటే
రాయం, డమ్మరొ ? వెఱ్ఱిఁబోని కులమర్యాదల్ విడం జూతురే ? 98

క. అనిపలికెడి తన పలుకులు
వినియును వినకున్న యట్లభినయించుసుతం
గని యిట్లనుఁ గార్యమ్మున
కనుకూలం బైనతోఁవ యావటిలంగన్. 99

ఉ. "ఏల విచారమంద? వినుమీ! యయవారికి దగ్గరైన చు
ట్టాలఁట, పెండ్లియంచుఁ గడు డంబుగ మేళము రమ్మటంచుఁ దాం
బూలము నిచ్చిపోయి రెటుఁబోతివొ? నిన్ గవ వార లెంతయున్
జాలము చేసి రిచ్చట, వెసం జనుదెంచునఁ టయ్యవారునున్. 100

ఉ. వచ్చుట నిక్కమేని యయవారటకున్ సమయమ్ముఁ జూచి నే
నచ్చకబుచ్చకల్ గొలిపి యాదరముం గలిగించి నీయెడం
బొచ్చెము లేనికూర్మిఁ దగఁ బొత్తు లగింపఁగఁ జేతు నమ్మ; నీ
ముచ్చటఁదీర్తు నీవిఁకఁ బ్రమోదముఁ జెందఁగదమ్మ! నెమ్మదిన్. 101

చ. పరిచయ మెక్కుడైనపిదపన్ మఱి యెంతటివారినైన ము
మ్మరమగు మోహవారినిధిమగ్నులఁగా నొనరింపవచ్చు నీ
వెఱుఁగవు గోల వౌట, నిటు లెందఱ నెందఱు మోసపుచ్చి ర
మ్మరొ? యిఁకఁ దక్క నీతఁ దనుమానము మానుము మానసమ్మునన్.

క. నీపాటయు నీయాటయు
నేపుగ నొక నాల్గురోజు లీతండు గనం
గాపాడఁగలఁడె ధైర్యం?
బేపా టీతఁ డన? ఋశ్యశృంగుఁడె? చెపుమా. 103

తే. గీ. మనకు మేళములకు వచ్చు ధనముకన్నఁ
దగినవారలతోడ సందర్భములు ఘ
టించుటే ముఖ్యమగు లాభ మెంచి చూడు
మేమెఱుంగుదు వీలాభ మిందువదన? 104

ఉ. మేళ మటంచు నేగునెడ మేలిమిసొమ్ములు లేనిదైన బల్
లీలలు లేనిదైన వెలలేమ పసందుగ నెర్వుసొమ్ములం

దాలిచి వేషభాషలఁ గనంబడినంతనె యెంతవారికిన్
బాళి మనమ్మునన్ మిగులఁ బాల్పడు నే మనుకొంటివమ్మరో? 105

ఉ. ఇంతియకాకయున్నఁ దమయింట నెసంగెడి సుందరాంగులౌ
కాంతలకన్న నెక్కుడగు కాంతలమే మన? మెంతచక్కనౌ
కాంతకుఁ గాంతుఁడైన మన కాంతలఁ గన్గొని మోసపోవు; నౌ
నింతకు ముఖ్యకారణము నెన్నఁగ మేళముసుమ్మ కోమలీ! 106

క. నవనాగరికులు గొందఱు
శివశివ! మన మేమి తప్పుఁ జేసితిమొ 'శుభం
బవు నెడ మేళమ్ములు పి
ల్వవల' దటంచును బ్రతిజ్ఞఁ బట్టిరఁటమ్మా. 107

క. 'మేళమునకు బదులుగ వీ
ణాలాపమ్ములకు మోదమందఁగ రాదే?
హేలమెయిఁ బాడు పైఁ డికు
లేలా భోగాలకన్న నెసకంబిడరో? 108

క. వీరల కిచ్చెడి ధనమున
నాఅవపాలిడిన వార లధికామోద
శ్రీరాణింపఁగఁ బాడరె?
వారాంగన లేల? పో! వివాహమ్ములకున్. 109

ఉ. వారలలో శతాంశమును బాడఁగ లేరది యట్టులుండ సిం
గారములూని వచ్చిన నెగాదిగఁ జూచి మఱెంతవారలున్
ధీరత మాని ద్రవ్యమును దేహమునుం జెడఁగొట్టుకొందు రీ
వారసఖీసమన్వితవివాహము లేరికి ముప్పొనర్పవే.' 110

క. అనిసభలు చేసి లెక్చెరు
లనేకము లొనర్చి 'మేళ మరుదెంచినచోఁ
జను దేరము పెండ్లికి మే'
మని కొందఱు నిశ్చయించి రని వింటిఁ జుమీ. 111

క. 'కానిండు మానునె ? యనూ
చానాచారము' లటంచు సభ్యులమాటల్
వోనాడి పెండిలికి మే
ళానకుఁ దాంబూల మిడి రెలమి నీసామున్." 112

క. అని కూఁతునకుం జెప్పిన
విని బాలామణియు "నెప్డు పెండిలి యగు" నం
చును నెంచుచున్న నాలో
ననె వచ్చె వివాహమును ఘనంబుగ నంతన్. 113

తే. గీ. చుట్టపక్కాలతో బలుసొబ గెలర్పఁ
దఱలి వెడలిరి పెండ్లి కందఱును గలసి
ముఖ్యబంధువు లగుకతమునను బెండ్లిఁ
జూడఁగా నేగె నమ్మధుసూదనుఁడును. 114

క. వాఁడే శ్రీవువంశభవ! సుర
రాడగ్రిమణీయవిభవ ! కవిరాజసుకవితా
లిడగ్రిసనా ! కల్పావని
రుడాగ్రిజసమానదానరోచిష్ణుమతీ ! 115

ఉ. వేంకటరాయసోదర ! నవీనసుమాస్త్ర ! పురారికామినీ
కింకర ! పీఠికానగరకీర్తితమందిర ! పద్మనాభమా
వంకజభాస్కరా ! సుకవిబాంధవసంయుత సౌధభూమికా !
వేంకటరత్నమంత్రిమణి ! విశ్వజనీనకలాగ్రణీమణీ! 116

మాలిని. సుకవికమలమిత్రా ! సుందరాకారచైత్రా !
వికచకమలనేత్రా ! విశ్వసౌమిత్ర్యపాత్రా!
పరికృతసుకృతకృత్యా! పండితగ్రామనుత్యా !
సకలసచివగణ్యా ! సజ్జనస్తుత్యగుణ్యా ! 117

— గద్య —

ఇది....శ్రీ తిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబైన
కేవలకల్పితంబగు శ్రవణానందంబను మహా
ప్రబంధమునందు ద్వితీయాశ్వాసము.

శ్రీ ర స్తు

శ్రీమత్పరదేవతాయైనమః

# శ్ర వ ణా నం ద ము

## తృ తీ యా శ్వా స ము

క. చటుకవితావిద్యాలం
పట ! ఆజన్మప్రకృష్టభాగ్యోదయ ! దు
ర్ఘటకార్యసంఘటక ! వేం
కటరత్నామాత్య ! సుకవికమలాదిత్యా ! 1

వ. అవధరింపు మనంతరంబు.

చ. జరగె వివాహ మద్భుతరసప్రసరత్కలకంఠకంఠభా
స్వరతరుణీమణీనటనసంగతమంగళవాద్య ఘోషవి
స్ఫురితదిగంతరాగతవిశుద్ధచరిత్ర ధరాసురాధిరా
జరుచిరమంగళశ్రుతిరసప్రథితప్రమద ప్రదంబుగన్. 3

సీ. ఒకచోట సకలవైదిక సంతతులగోష్ఠి
యొకచోటఁ బండితప్రకరగోష్ఠి
యొకచోట సుకవిరాణ్ణికురంబములగోష్ఠి
యొకచోట మంచివైణికులగోష్ఠి
యొకచోట సరసగాయకవతంసులగోష్ఠి
యొక్కచోటను వారయువతిగోష్ఠి
యొకచోట నైతిహాసికకథారసగోష్ఠి
యొకచోటఁ బారిహాసికులగోష్ఠి

తే. గీ. యొక్కచోటఁ జిరంటికాయువతిగోష్ఠి
యొక్కచోటను భటరాట్ప్రముదయగోష్ఠి
యతిశయిల్లఁ గ్రమమ్ముగా నైదురోజు
లును జెలంగె వివాహమ్ము ఘనులు మెచ్చ. 4

ఉ. ఒక్కపు డొక్కవేషము మఱొక్కపు డింకొకవేష మింకనొ
క్కొక్కపు డొక్కవేషము నొప్పుగఁ దాల్చి విలాసయుక్తమౌ
చొక్కపుఁబ్రైఁడిబొమ్మ యనఁ జూపఱు లాసను జెంద బాల దా
నెక్కుడు నేర్పుగా నభినయించు సభాసదు లెల్ల మెచ్చఁగన్. 5

శా. ఆ నాట్యాభినయమ్ము లా రసవచఃప్రారంభసంరంభ మ
త్యానందం బొదఁగూర్ప సభ్యజను "లయ్యారే! బళీ! మేలు మే!
లీ నారీమణి పేరదేమొ? యహహా! యీబాలయా రెడ్డియో
యీ నాఁటం గనఁబోము దీని కెనయౌ నేణాక్షి నింకొక్కతెన్." 6

వ. అంచు నపరిమితానందంబునఁ గొందఱుసాము లిట్లనిరి. 7

చ. అసమరసాబ్ధిలో నభినయమ్మనుతెప్ప సహాయమూని మా
నసములు కేళి సల్పఁగ మనమ్ములవెంటనె యింద్రియాళి సం
తసమున లేచిపోవఁగ సదస్యులు జంత్రపుబొమ్మలైరి నీ
పసఁ గనుఁగొన్నమాత్రన సెబాసు! సెబాసు! సరోజలోచనా. 8

శా. భావంబా! సొగసా! రసప్రసరమా! పాండిత్యసందర్భమా!
హావంబా! స్వకపోలకల్పనములా! వ్యంగ్యప్రధానత్వమా!
నీ వేపండితునొద్ద నేర్చితివొ కానీ నీరజాతేక్షణా!
యీవే రంభవుగాక రంభయన వేఱే లేదు చర్చింపఁగన్. 9

వ. ఇదియు నుంగాక.

సీ. ఆబాల ననురక్తి నంది చూడనివారు
చూచి మోహాబ్ధిలోఁ జొరనివారుఁ
జొచ్చి మాయనిబాధ సొక్కి వ్రాలనివారు
వ్రాలి లోపల సిగ్గు వడనివారుఁ
బడియును వారల బసకుఁ జననివారుఁ
జనియు "మామాట" యంచ నననివారు
నని విఫలత్వంబుఁ గనక యుండినవారుఁ
గని మదిలో నీర్ష్యఁ గననివారు

తే. గీ. నూటి కొకరైన నచ్చటి నీటుకోడె
కాండ్రిలో మందువకునైనఁ గానరారు;
పెద్ద పెద్దల మనములే బిగువు చెడఁగ
వారలకు నట్టు లుండు టబ్రమ్ముగాదు. 11

చ. ఇది యిటులుండ నమ్మదిత యేసమయమ్ముననైన వీలుగా
నదను తటస్థమైన యపు డమ్మధుసూదనుతోడ హాస్య మొ
ప్పిదముగఁ జేయుఁ గన్గొలుపుఁ బ్రేమ దలిర్పఁగ గోట గీటుఁ దా
బదు లొనరింపఁ డాతఁ డొకపట్టుననైన నదేమి చిత్రమో! 12

వ. ఇట్లు వివాహంబు సలక్షణంబుగాఁ జేసికొని పెండ్లివారేగు నయ్యవ
సరమ్మునం దత్పురసమీపమ్మున. 13

సీ. ద్రాజ్ఞదీతరణతంద్రాణపాంథాహూత
నావికప్రతివచోరావకంబు
ఆనీయమానమీనాకులీభవదనే
కానాయకరధీవరాకులంబు
అంతరీపాగతానంతగోగోపాల
కాయపవిద్వారికణగణంబు
వికసత్కుసుమపుంజవిహరమాణనవీన
మలయమారుతపోతమానితంబు

తే. గీ. అపరరోధోవిహారాగతానమాన
హూణమిథునావలోకనాహూయమాన
హాలికాన్యోన్యభాషణవ్యాకులంబు
చేతము గరంచు నొక్క ధునీతటంబు.

తే. గీ. కాననగుటయు వారు భాస్కరుఁడు చరమ
గిరి సమీపమ్మునకుఁ జేర నరుగుటయును
దత్తఱమ్మున నొక లంచఱును నెక్కి
దాఁటసాగిరి నావికుల్ దాఁటఁజేయ. 15

తే. గీ. "వారకాంతనుగూడ నీవంటివాని
కర్హమా" యని వారుణి యధికకోప
శోణదృక్కోణయై తన్నుఁ జూచుకతన
నో యనఁగ సూర్యుఁ డారుణ్య మొందె నంత. 16

తే. గీ. పద్మినీకాంత యపరదిగ్భామఁ గూడఁ
గాఁ జనెడి కాంతుఁ దా బలాత్కారముగను
లాగ, జాఱిన రక్తచేలంబనంగ
సంజకెంజాయ దోఁచె దిక్సంధులందు. 17

తే. గీ. వారకాంతను దవిలి తా వసువిహీనుఁ
డగుచు నిచ్చోట నిఁక నుండఁదగ దటంచు
వ్రీడచే సూర్యుఁ డస్తాద్రి వెన్కఁ జేరె
రిక్తులకు వారకాంతలు రిప్పులు గారె? 18

శా. జాతెన్ సంజ, పతత్రిసంఘములు వృక్షవ్రాతనీడమ్ములన్
దూతెన్, హాలికజాతి యిండ్లకడ కత్యుచ్చైరయం బొప్పఁగాఁ
జేరెన్, మన్మథుఁ డాశుగమ్ములను నిష్పీమపర్భావమ్మున
న్నాటెన్, భర్తలరాఁక చిత్తసరణిన్ గోరెన్ వధూసంతతుల్. 19

సీ. చోరసంస్కృత్యసాధారణాధారంబు
జారసాంగత్య కేదారభూమి
ఘూకలోకాలోకవాకచక్యంజనం
బేకాకికోకశోకాకరంబు
దీపావళీమహాటోపసంధానంబు
నక్షత్రివజ్రిశాణఫలకంబు
చాక్షుషజ్ఞానప్రశమనావధిదైవంబు
కృషికృతితతి సముత్కృష్టవిష్ణు
తే. గీ. మఖిలమార్గావరోధ బ్రహ్మాగ్రహంబు
నుచ్చభూనీచభూసమానోపకరణ

మప్రమేయం బఖండం బనంత మగుచు
నాక్రమించెఁ దమంబు దిక్చక్రమెల్ల. 20

తే. గీ. అచ్చటచ్చట నొకటొక్కటై గణింపఁ
దగిన నక్షత్రము లగణ్యదశ వహించి
తమకు నుపకారకంబగు తమము గొంత
పో నడంచెఁ గృతఘ్నునిపోల్కి నపుడు. 21

సీ. కమలినీముఖ విలాసముల కెవ్వాని దీ
ప్తిప్రచారంబు సుప్తిప్రదంబు
కైరవిణీవక్త్రకలన కెవ్వాని యా
గమన మవ్యభిచారకారణంబు
చంద్రికాపక్షితృష్ణావ్యాధి కెవ్వాని
ప్రాప్తి నిర్వ్యాజదివ్యౌషధంబు
కోకీమనోనంతశోకాబ్ధి కెవ్వాని
యుదయంబు పర్వచంద్రోదయంబు

తే. గీ. మానినీజనమానహిమాని కెవని
రాక నళినీమనోనాథురాక, విరహి
జనుల కెవ్వాఁడు ప్రత్యక్షశమనుఁ డాతఁ
డుదయమందెను జంద్రుఁ డత్యుచ్చుఁ డగుచు. 22

తే. గీ. ఇటుల వెన్నెల లెల్లెడ నెసక మెసఁగె
గచ్చు చేసినయట్లు జగంబు మెఱసె
నదిని దరియించి సాము లంతఱు ననేక
మార్గముల నేగ సాఁగి తమందగతుల. 23

తే. గీ. అన్నదీతీర సౌభాగ్య మరసికొనుచు
మోదమందుచు నమ్మధుసూదనుండు
తా నొకఁడె యేగుచున్న యత్తటిని బాల
వెనుకఁ జనసాఁగె నిదివేళ యని తలంచి. 24

సీ. తైక దాఁటియు బనారసుకండువా దాఁటి
గబ్బిగుబ్బలకాంతి గంతు లిడఁగ
గాగరా దాఁటి పైఁ గట్టుపుట్టము దాఁటి
తొడలయందం బడావడి నొనర్పఁ
గర్ణమ్ములను దాఁటి గండస్థలము దాఁటి
కమ్మలకాంతి యాగడముఁ జూపఁ
దలఁదాటి మొలదాఁటి తళ్కు మీఱెడిమేల్మి
బంగారుజడ బరాబరులు వేయఁ
తే. గీ. పార్శ్వగతవృక్షగళితపుష్పప్రకీర్ణ
మై శుకపికాళికలకూజితాభిరామ
మై మలయమారుతోపేతమై తనర్పు
నట్టి యాయేటియొడ్డున నరిగి యరిగి. 25

సీ. చెట్టుచెట్టునకు విచ్చినపుష్పజాలంబు
వర్షించు వలిపిల్లవాయువులకు
నడుగడ్గునకుఁ బల్లవాంతరమ్ములనుండి
కెరలి పైఁ బడు చంద్రకిరణములకుఁ
దేపతేపకు దిమ్మదిరుఁగ జుమ్మని మీఁదఁ
బడి హళాహళి సేయు భ్రమరములకు
మాటిమాటికిఁ గామమంత్రముల్ తెనిఁగించి
విప్పిచెప్పెడి శుకపికములకును
తే. గీ. గెరలి యన్యోన్యమున రతిక్రీడ సల్పి
కోరికల కీరిక లొసంగు శారికలకు
ధైర్యమును ధారవోసి తత్తటమునందు
మెల్లమెల్లనఁ బరుగిడుఁబల్లవోష్ఠి. 26

శా. వన్నెల్ గుల్కెడి నవ్వునెమ్మొగముతో వాలారు లేఁజూపుతో
సన్నంబై యసియాడు నెన్నడుముతో జానైన చన్దోయితోఁ

గన్నుల్ చల్లఁగఁ జేయఁజాలు వగతోఁ గంపించు మైదీవతో
వెన్నాడంగల వేణికాభరముతో వెన్నాఁడెఁదా నాతనిన్. 27

సీ. చిన్నివన్నెలమోముచెల్వు వడ్డి కొసంగు
చిన్నారిపొన్నారి చెమటదాని
నాయాసమున రెప్ప లల్లనల్లన నార్చు
శ్రీయుతం బగు కన్నుదోయిదాని
నొలయు నిట్టూర్పువాయువులచేఁ దబ్బిబ్బు
లై యుబ్బు పెన్గుబ్బ లమరుదానిఁ
గరఁగి నీరై నాసికను జాలువాఱుసిం
దూరంపుతోరంపుసొరుదానిఁ

తే. గీ. గలకలధ్వను లొలయఁ బొంకమ్ముమీఱ
జాఱు మొలనూలుగల కటిస్థలముదానిఁ
గందియున్నట్టి పాదయుగంబుదానిఁ
గనియె మధుసూదనుండు వెన్కకును దిరిగి. 28

క. కనినంతనె తనమనమున
ఘనమైన వికారరీతి గనుపట్టుటయున్
దనలోఁ దా నిట్లని యను
కొనియె సమస్తంబు నెఱుఁగుకోవిదుఁ డగుటన్. 29

సీ. పగలు భార్యను బట్టి పడఁగొట్టు ముక్కోపి
భృత్యుఁడై చరియించు రేయియందుఁ
బగలు స్త్రీ యవ శత్రువుగఁ జూచు విజ్ఞాని
నిశియందుఁ బరమాత్మనియతిఁ జూచుఁ
బగలు సన్న్యాసమే "బహుబా" గనెడి యోగి
రాతిరి తనదుభార్యను స్మరించుఁ
బగలు "వివాహంబు వద్దు వ" ద్దనువర్ణి
పెండ్లికై రాతిరి పేర్మిగొలుపుఁ

తే. గీ. గాన నెటువంటివాఁడైనఁ గాని రాత్రి
యేకతమ్మున శ్రీగాలి సోకె నేనిఁ
దత్తఱం బంది పరవశాయత్తుఁ డగుచుఁ
గోర్కె లిగురొత్తఁ బైఁబడఁ గోరకున్నె ? 30

తే. గీ. అనుచుఁ బరిపరివిధముల నతఁడు తనమ
నంబులో నూహసేయు, జ్ఞానంబు గల్గు
వారల కొకప్డు వికృతి చేకూరుఁగాక
యితరులంబోలెఁ దుందుడు కెనయఁబోరు. 31

వ. ఇట్లతండు డోలాయమానమానసుం డగుచు మెల్ల మెల్లన చనుచు
న్నంత నబ్బాలామణియు, 32

క. పిలిచి యిటు లనియె ముద్దులు
గులుకఁగ "మీతోడఁ గలసికొనుటకునై నే
వలసి చనుదెంచితిని నా
వలనైనను జూడ రిది నెబాసన రాదే ? 33

క. మావారలు కడుదూరము
గా వచ్చుచునున్నవారు కావున మిమ్మున్
నే వేఁడెద నిచ్చోటన్
మావారలు వచ్చుదనుక మసలుట కొఱకున్. 34

వ. అనిన నాతండును ప్రతిఁ జెప్పనేరక వల్లెయని యచ్చోఁ గూరుచుండు
టయు నక్కన్నెమిన్న నాతనిపజ్జకుం జేరి యిట్లనియె. 35

చ. "సరసుఁడ వంచు నెంతయును జాతురి గల్గినవాఁడ వంచు సుం
దరుఁడ వటంచు నిన్ గని యెదన్ గదియన్ గమకింప నాపయిన్
గరుణ యొసంగదాయె నిది కాముకధర్మమె ? కోరుదాని నీ
వరుస ననాదరింపఁ దగవా ? మగవారల కెందు" నావుడున్. 36

క. "మగువా ! కాముకులగు న
మ్మగవారికి నీవు చెప్పుమాటలు సరిగా

దగుఁగాని మమ్ముఁబోఁట్లకుఁ
దగునా? చెప్పు" మన నిట్లతని కనెఁ జెలియున్. 37

క. "ఆఁడుది గోరిన గాడిద
వాఁడే కోరినను మొగలివంటిది" యనుచున్
జేడెలు సెప్పెడి సామెత
నేఁడే మీవలన నాకు నిక్కంబాయెన్. 38

క. వెలఁది తనంతటఁ దానై
చులుకఁదనమ్మునకు మనసుఁ జొన్పుచు సిగ్గున్
వెలితియొనర్చుటకన్నను
గలదే మఱి తప్పిదంబు? కవికులవర్యా! 39

క. రసికుఁడవని నిను గోరిన
రసహీనముఁ జేసి యిట్లరయకయె నన్నున్
గసరుట ధర్మంబగునే
రసికులు వినిరేని నవ్వరా, రసికవరా! 40

ఉ. మూలము లేని టీక సుమపుంజసమృద్ధముగాని శయ్య వా
చాలతలేని పాండితియు సంతతిలేని గృహంబు మంచితాం
బూలములేని భోజనము ముద్దులు గుల్కెడి కన్నెమిన్నతో
మేళనలేని జవ్వనము మేలగునే? కవిరాజశేఖరా!

చ. 'సుకవి యితండు విద్యాదియు సుందరి వీరల కెంతమాత్రమాశా
రకముగనున్న' దంచు 'ఘటనానిపుణత్వ మయారె!' యంచుఁ బెం
డ్లికిఁ జను దెంచినట్టి ఘనులే వచియింపఁగ వింటి; నన్ గ్రహిం
పకునికినైనఁ దప్పదిది, వచ్చిన వాదులు తప్పిపోవునే? 42

క. మన కిది వఱకే కలదని
జను లెల్లరుఁ జెప్పికొనఁగ సాఁగిరి కాదే!
'జనవాక్యం కర్తవ్యం'
బను పెద్దల పల్కులకును నాఱడి కలదే? 43

తే. గీ. ఏల యీలాటిమాటలు ? చాలుఁజాలు,
'హితవుగా' దని చెప్పరాదే, మహాత్మ !
'ఆలి నొల్లనివానికి నీలకూర
లోన నుప్పెక్కు' డను మాటలు నిజమాయె. 44

క. వెడవిల్తుఁడు శరముల బా
రిడి ననుఁ గుడి యెడమ లేక యేయఁదొడంగెన్
గడెయైనఁ దాళఁజాలను
దడ వొనరించు టిది మంచితనమా ? ఘనమా ? 45

ఉ. వాదము లేల ! వట్టి యపవాద వహింపఁగరాదు గాన మీ
పాదములాన యింక వలవంతలఁ బెట్టుటగాదు, చిత్తదా
యాదుఁడవైతి శంక వల" దంచుఁ గరగ్రహణం బొనర్చె నా
గాదిలివన్నెలాఁడి; భువిఁ గొంతలసాహస మింతయొప్పునే ! 46

ఉ. గుట్టు చెడెన్, దడాబిడిగ గుండెలు జల్లనె, మై చమర్చె ని
ట్టట్టు వడంకె హస్తములు, నన్యముఁ జెప్పుటకోపఁడాయె, నా
పట్టున నా ఘుకుండయినఁ బల్కఁగలాఁడె మఱొక్కమాట ! లేఁ
డట్టిజితేంద్రియుండు ప్రవరాఖ్యుఁడుదక్క మఱొక్కఁ డెక్కడన్. 47

ఆ. వె. అట్లు కరమువట్టి యాలింగన మొనర్ప
నిచ్చఁజేయు నంత నేగుదెంచి
రా సరోజనేత్ర యనుఁగు నెచ్చెలు; లతం
డానిమిత్త మెంచి యవలఁ ద్రోచె. 48

ఉ. త్రోచిన వెన్కఁజూచి, తనతోడిచెలుల్ పఱతెంచుటం గదా :
యీ చెలికాఁడు సిగ్గు వడియెం ; జెలు లిప్పుడు నాదుపాలికిన్
బూమలవంటి వారయిరి పో ! యని చింతిలసాఁగె; స్నేహముల్
దోఁచవుగా మనం బతనుదోషపరీవృత మైనవేళలన్. 49

వ. అట్టియెడ దగ్గరి నెచ్చెలు లిట్లనిరి. 50

సీ. ''పరిహాసమునకు నే 'బావగా' రనిపిల్వఁ
'బో'మ్మన్నవారు కాఁబోలు వీరు!
వారు గారే వీరు చేరి నే 'మఱదిగా'
రనిపిల్వఁ గసరుకొన్నట్టివారు!
వారు గారే వీరు వలపార మనకాంత
దరిఁజేర వెన్క_కు జరగువారు!
వారు గారే వీరు 'వారకాంతలు మాకుఁ
బనికి రా' రని ప్రజ్ఞఁ బలుకువారు!
తే. గీ. వారలునుగారు వీర లెవ్వారొగాని,
వారలేమైన నీలాటి పనులొనర్తు
రే!" యటంచును నాయమ్మువలెత్తి పొడిచి
గేలి గావించి రమ్ముద్దరాలి చెలులు. 51

తే. గీ. ఇటులు పల్కెడి కాంతల కుటిలవచన
ములను వినియును వినని యట్లొలయఁజేసి
రయము మీఱంగఁ జనెఁ గవిప్రవరుఁ డంతఁ
దనమనమునందు సందేహ మినుమడింప. 52

సీ. బ్రహ్మదేవు మొగమ్ము పడఁతిక్కిఁ బడకెల్లు
చేసి పెట్టినయట్టి చేవకాఁడు
హరియురస్థ్సల మెక్కయంగనామణికి శ
య్యాతలమ్ముగఁ జేసినట్టి ఘనుఁడు
సాంబుశరీరంబు నంబుజాక్షికి ధార
వోయింపఁ జేసిన మాయకాఁడు
"స్త్రీలఁజూడ" మటంచుఁ దెగనీల్గు పెద్ద పె
ద్దల గర్వముల గంగఁ గలుపువాఁడు
తే. గీ. తత్కరస్పర్శతన్మృదుతరవచశ్శ్ర
వణములను బీజమునఁ బునర్భవము నొంది

యంతలో వృద్ధిఁ జెంది కొండంత యగుచు
నాతనికిఁ ద్రోవలోనఁ బ్రత్యక్షమయ్యె. 53

సీ. నడచునేకాని యానడచుమార్గం బేద
కేగునో యాతని కెఱుక లేదు
చూచునేకాని యాచూచు పదార్థము
లెవ్వియో యాతని కెఱుక లేదు
వలఁచునేకాని యాతలఁపులో సంగతి
యెద్దియో యాతని కెఱుక లేదు
నవ్వునేకాని యానవ్వు నవ్వుట కేమి
హేతువో యాతని కెఱుక లేదు
తే. గీ. పలుకునేకాని పిల్చినవార లెవరొ
యెంతమాత్రము నాతని కెఱుక లేదు;
ఏమి చెప్పుదు! నంతలో నింతయయ్యె
నాతని యవస్థ యా ఋషకేతు వలన. 54

క. వివిధములగు నింద్రియములు
వివిధములగు కోరికలును వివిధగతులఁ దన్
గవిసి కొలువంగ నాతఁడు
భవనమ్మును జేరె దిల్లపడిన మనముతోన్. 55

ఉ. చందురుఁ జూచి యుల్కిపడు, జల్లనిగాలికి వెట్టఁజెందు, నే
చందము నందముం గనఁగ నైచఁడు, నిద్దురఁ జెందనోపఁడా
సుందరిచందముల్ మదిని జొన్పి యవార్యములైన కోరికల్
సందడిఁ జేయ మందుని పసందునఁ గుందుఁ గవీంద్రుఁ డెంతయున్.

ఉ. "వేసవి మల్లెమొగ్గలకు వియ్యపురాలు రదాళి, నాసలో
పీసము గాదు గంధఫలి, వేల్పు మిటారుల తోడికోడ లా
రా! సఖి, దానిఁ బోల్పఁదగవా? యితరాంగనలన్, సెబాసు! బా
లాసతిఁ బోలఁగల్గు నవలా భువిలో సహి లేదు లే" దనున్. 57

వ. అని పట్టిరాని తమకమ్మున. 58

శా. వెన్నన్ జెంపలగొట్టు మైనునుపుతో, విందైన కెమ్మోవితో,
సన్నల్ సేసెడి ముద్దుకన్నుఁగవతో, జాతైన పయ్యంటతో,
గన్నేరుంబువు గాగరా సొబగుతోఁ గాఁచించి దోతెంచు నిన్
గన్నారం గని ముచ్చటాడఁగల భాగ్యం బెన్నఁడో? కోమలీ. 59

సీ. పలు కొక్కటియె సేయుఁ బదివందల వరాలు
వాలుఁజూపులు రెండువేలు సేయుఁ
నగ వొక్కటియె సేయు నాల్గువేల వరాలు
పిఱుఁదుఁగుబ లాఖువేలు సేయుఁ
బద మొక్కటియె సేయుఁ బదివేల వరహాలు
లావణ్య మది యొకలక్ష సేయుఁ
బిలుసోయగమె సేయుఁ బదిలక్షల వరాలు
కులుకుగుబ్బలతీరు కోటి సేయు

తే. గీ. ముద్దుగుల్కెడి నెమ్మోము మూఁడుకోట్లు
నాససొబ గెన్న దెబ్బదినాల్గుకోట్లు
నుదుటి సింధూరనామమ్ము నూఱుకోట్లు
నీకు వెలఁజెప్ప శక్యమే? నీలవేణి. 60

సీ. కలికిరో! మెత్తనై యలరు నీ మే నొక్క-
సారి గ్గిల్లినఁ బాలు గారకున్నె!
యబలరో! మించులై యలరు నీచూపులు
సోకినంతనె మది చొక్కకున్నె!
పొలఁతిరో! మృదులమై యలరు నీ కెమ్మోవి
నొక్కినంతనె తేనె చిక్కకున్నె!
చెలియరో! నీడుకౌఁగిలి యొక్కత్రుటియైన నఁ
బడసిన రస ముట్టిపడకయున్నె!

తే. గీ. మగువ! నీతోడ నొకమాఱు మాటలాడ
సరసకవితావిశేషంబు మెఱయకున్నె!
ముదిత! యొకసారి నీకమల్ ముద్దుగొనిన
బ్రహ్మకైవల్యపదవి చేఁబడకయున్నె! 61

సీ. తడబాటుచేతఁ జే యొడిసిపట్టి 'కటాక్ష
ముంచుమా' యన నాలకించనైతిఁ
దుమ్మిన పిచ్చి తుందుడుకుగుబ్బలఁ గౌఁగి
లింపఁ బూసిన సమ్మతించనైతిఁ
గలకండకన్న మిక్కుటమైన రుచిగల్గు
కెమ్మోవి రుచులారగించనైతి
వెడవింటివాఁడు ఱువ్విన బాణములఁ జాల
వగలఁ బొందిన జాలిఁ దగులనైతిఁ

తే. గీ. బవలు చెయిపట్టి పిలిచినఁ బలుక కట్టి
చావ నమవస చీఁకటిలోన పిలి
చీరఁ గట్టినతఱి సన్నఁజేయు వెఱ్ఱి
పగిది నేఁ గోలుపోతి దైవంబ! నేఁడు. 62

చ. కనుఁగవ కింపు గల్గి తగు కామకలావ్యసనంబు గల్గి యౌ
వనమున లేఁత యయ్యు రసభావములం గడుఁ బెద్దయై తనం
తన వలపున్నదైన వనితామణి యెవ్వనికబ్బుఁ? బ్రాగ్భవం
బునఁ దులలేని పుణ్యములు పూవులు పూచి ఫలింపకుండినన్. 63

చ. బిలిబిలిపల్కులున్ సొగసుఁ జిల్కెడి ముద్దులుఁ దాఱుమాఱులున్
వలపులచోద్యముల్ మిగుల వన్నెలుఁ జిన్నెలుఁ గల్గుకౌఁగిలిం
తలు బ్రతిమాలుటల్ కసరి తప్పులువట్టుటలుం జెలంగుకాం
తలరతమే రతంబు; మఱి తక్కినవెల్ల రసాతిదూరముల్. 64

చ. వలచినలేమఁ గూడుటయె భాగ్యము, భార్యలవల్లఁ దత్సుఖం
బలవడ; దన్యకాంత లనఁగా, మఱి తల్లులవంటివారు; వే

శ్యల కిడి సున్న; యొక్కయెడ సంభవ మందిన నట్టివేశ్యతోఁ
గలయుటకన్న వేఱొకటి కల్గునె? స్వర్గము మోక్షమున్ భువిన్. 65

ఉ. తానఁట, వేశ్యకాంతయఁట! తానయి తాఁ దనుగోరునంట! యెం
తేనియు ముద్దులాఁడియఁట, యీడును జోడఁట! మౌనియైనఁ దా
మానఁగలాఁడె? వేయి పయిమాటలు సెప్పఁగ నేర్చుఁగాని; యే
మైనను దీనిఁ గూడవలదా? యిలఁదా జనియించినందుకున్. 66

సీ. కలుగనేకలుగదు కలిగెనేనియు ఛాంద
సున కనాథస్త్రీగమనము గల్గుఁ
గలుగనే కలుగదు కలిగెనేనియుఁబండి
తునకు బరస్త్రీగమనము గల్గుఁ
గలుగనే కలుగదు కలిగెనేనియును రా
జునకు దాసస్త్రీగమనము గల్గుఁ
గలుగనే కలుగదు కలిగెనేనియుఁ గవీం
ద్రునకుఁ బణ్యస్త్రీగమనము గల్గుఁ

తే. గీ. గలుగ దొకవేళఁ గలిగినఁ గలుగు మునుల
కప్సరస్త్రీగమన మని యనుటవలనఁ
గవులకును వేశ్యలకుఁ దప్పుగాదు చెలిమి;
దానిలో నప్రయత్నసిద్ధ మిదికాదె! 67

ఉ. కోరినదాని మాను టది గొప్పవిశేష, మిఁకట్టిపూరుషుం
డారయ లేఁడు నూటి కొకఁడైనను, గోటికి నొక్కరుండు చే
కూరునొ, లేదొ? తా నగుచుఁ గోరెడి పూరుషుఁడన్న వెఱ్ఱివాఁ
డై రసహీనుఁడై జగమునం దపహాస్యతఁ గాంచకుండునే! 68

సీ. తనకుఁ దానై వండుకొని తిన్న నద్ది య
న్నంబు గా దద్ది సున్నంబు గాని
తనకుఁ దానై వేసికొనిన నయ్యది వీడి
యమ్మ గాదది వడియమ్మ గాని

తనకుఁ దానై పెట్టికొనిన నయ్యది మంచి
కొప్పు గాదది ప్రోఁత చెప్పు గాని
తనకుఁ దానై చెప్పుకొనిన నయ్యది సుప్ర
తిష్ఠ గాదది యప్రతిష్ఠ గాని

తే. గీ. తనకుఁ దానయి పొంద నమ్మనుచుఁ గాంతఁ
గోరునది నోరు గాదు పైజారు గాని
యప్రయత్న సిద్ధమ్ముగ నబ్బినట్టి
పొందు లొడఁగూర్చుఁ గాదె పెంపొందుసుఖము! 69

క. కవితయు వనితయుఁ దనయం
త వలచి వచ్చిన ముదం బొదవఁ జేయును; ము
క్కువలేక బలాత్కారం
పువిధంబున వచ్చినదియ పో! దుఃఖమిడున్. 70

క. ధనకాంతామోహమ్ములు
జనులకు స్వాభావికములు జగమున; నెవఁడీ
ధనకాంతామోహమ్ములఁ
గనకుండువాఁ డాని శివునిఁగా నెన్నఁదగున్. 71

వ. అని మఱియును. 72

మ. తగునే? సత్కవినైన నాకు ధనకాంతాసంగమం, బీపని
న్నగరే? పండితులైనవారు వినినన్, నాకేమి యా? నవ్వినన్
మగుడ న్నవ్వెద వారినంచు మది నిమ్మాడ్కిం బ్రశంసించు నా!
"తెగితే లింగఁడు రాయి" యంచను జనోక్తిన్నమ్మె నేమో కదా!

ఉ. కాంతల నమ్మరాదు పెలికాంతల నంతకుమున్నె నమ్మరా
దింతవిరుద్ధ ముండునె? బళీ! పెలికాంతలకు మోహ మ్ముండునే!
వింత గదా! జగమ్ములను వేములతీయఁదనంబు, లింతకుం
గొంత మనమ్ములో నరయఁ గూడదె? తుందుడు కింత చెల్లునే! 74

ఉ. కాంతలమాట నమ్మకొని కఁతునికిం గడు లోఁకువైతదీ
యాంతరభావముల్ దెలియ "కైసరుభోజ్జ" యటంచు నుబ్బుచుం

ద్రెంతవివేకులైన మది నీవిషయంబు పరీక్ష సేయఁగా
నెంతయు "కుక్కతోఁకఁగొని యేటను బడ్డ" విధంబుగాదొకో ? 75

ఉ. చేడెలు పిన్నకాలమునఁ జిన్నెలు వన్నెలు లేక యెంతయున్
"బూడెదబుస్స" నాకృతినిఁ బొందియు నంతట నీడు వచ్చుచోఁ
బాడుగఁ జేతు రెంతమతిపారగుచిత్తమునైన; నయ్యయో !
"గాడిదపిల్ల కోమలము" గాదె ? విచారణఁ జేసి చూచినన్. 76

ఉ. "మందుల పెట్టి యెంతమతిమంతుని చిత్తమునైన; లోనుగాఁ
గొందురు వారకాంత" లని కొందఱు పల్కుదు రెంతవెఱ్ఱిలో !
మందులు వేఱె యున్నవియె ? మాయలమాటలుఁ డక్కుఁజూపులున్
మందతరస్మితచ్ఛటలును మక్కువ చెక్కిలి నొక్కులున్ వినా. 77

వ. అని మఱియుఁ బశ్చాత్తాపమ్మున. 78

సీ. గరగరలాడు గాగరవన్నెకుచ్చెలల్
కాళ్ళపై వింతగా గంతు లిడఁగ
జిల్గుకంచెలలోనఁ జిక్కి చక్కనిగుబ్బ
దోయి మాటికిని దుందుడుకు సేయ
మునులనైనను దాసులను జేయఁగా జాలు
చూపు లింతనరాని సొబగుసీన
గాంగేయసచ్ఛాయ గదలుకొల్పెడి దేహ
కాంతి చూపఱగుండె గలఁగఁ జేయ

తే. గీ. నెన్నియో వన్నియలగుంపు లీనఁజాలు
నగవు మొగమునకెంతయో సొగసుఁ దెలుప
వచ్చి నాచిత్తము హరింపవచ్చును గద ?
పరువు మరియాదలు దలంపవలదె ? కాంత ! 79

ఉ. కంతునికేల నొప్పెసఁగు కమ్మని మామిడిపూలగుత్తి నా
నెంతయు నాదు కన్నుఁగవ కింపు ఘటించి యిదేమె ? యోసి క
ర్ణాంతవిలోచనా ! మనము నర్మిలి దొంగిలి పాఱిపోతి వా
వంతయు శంక లేక, మది నంత యరాజక మంచు నెంచితే ! 80

క. ఈ విధమున నతఁ డెంతయు
నావేదనఁ జెందుచుండె నవ్వనితయుఁ దా
నేవిధి దోఁచక గృహమున
కై వగ మీఱంగఁ జేరి యాత్మగతమునన్. 81

చ. తలఁచునొకో? మనమ్మున నతండు ననుం దనదానిఁగా, నటుల్
దలఁచిన నేమియౌను? దలిదండ్రుల చాటున నుండువాఁడు నా
చెలిమి గణించి నా గృహముఁ జేరఁగ నెంచునె? యిట్టివానిపైఁ
దలఁపు ఘటించుటే మొదటితప్పిఁక మాటలు వేయు నేటికిన్. 82

సీ. మొదట నే నన్నచో మొగము నెత్తనివాఁడు
క్రమముగా మోమెత్తి కాంచఁదొడఁగెఁ
దరువాత మాట కుత్తర మొసంగనివాఁడు
ఋజురీతి నుత్తరం బీయఁదొడఁగెఁ
బిమ్మట నర్మవాక్యమ్ము లాడనివాఁడు
గొంచె మారీతి భాషించఁదొడఁగె
నటుమీఁద సంస్పర్శ నాదరింపనివాఁడు
కేల్వట్టికొనుట కంగీకరించె

తే. గీ. విడె మొసంగిన గ్రహియించి వేసికొనియె
గోటగీఁటినఁ జాటుగా మాటుకొనియె
మాట లిఁక వేయునేల? నామాటయన్న
నడుగుదాఁటునె? యిఁకఁ గొంత గడచుమీఁద. 83

ఉ. అంతకు నోర్వఁ డాయెఁ బరమాత్ముఁడు, శ్రేయముఁ జెందువారి క
త్యంతము విఘ్నముల్ సలుపు, నంతియకాని యొకప్పుడైనఁ గా
సంతయుఁ జేయఁబూనఁడు సహాయము, దైవము దూఱఁజెల్లునే?
యింతకు నాకు వానికిని నేర్పడి యుండినఁ దప్పిపోవునే? 84

ఉ. తా నయి కోరు టన్నఁ గడుఁ దప్పిద మౌఁ గద వారకాంత; కెం
దేనియు నద్దియుం గలిగెనేని నెఱా సనిపించుకున్న మే

లౌ; నది యట్లుగాక యిటులైనను వేఱెకఁ జెప్పనున్నదే ?
లేనిది లేక యుండ సరిలేమలు నవ్వుటయుం దటస్థమౌ. 85

క. ఇటుఁ గుటిలాలక మనమున
గుటగుట మన్న, మూరు దూఱుఁ గువలయమిత్రుం
బెటిలి పడఁదిట్టు, నళులను
గటకట మని పండ్లు గొఱికి కసరు విసువుచే. 86

తే. గీ. యామినీగోపకామిని యాకసం బ
నెడిఘటమ్మున జ్యోత్స్న యనియెడి పెరుఁగు
దరచి చేర్చినవెన్నముద్ద యన నంత
వెడలెఁ దెల్లనికాంతితో వేగుఁజుక్క. 87

సీ. ఏచరణాయుధం బింపు మీఱఁగఁ బాణి
ని యతికి హరిస్వాదినియతిఁ దెల్పె
నేచరణాయుధం బాచారివిప్రుని
త్యస్నానదై వజ్ఞతను వహించె
నేచరణాయుధప్రాచుర్యరూపుఁ డై
హరి నిశీథము వేకు వనఁగఁ జేసె
నేచరణాయుధశ్రీచేత శూలి పి
ఠాపురమ్మున నుండెఁ గాఁపురమ్ము

తే. గీ. అట్టిచరణాయుధసమాజ మఖిలజార
చోరులకు గుండెలో దిగుల్ బోరుకలఁగ
ఉఉఉఊఊ యటంచు నత్యుచ్చరీతిఁ
గూయసాఁగెను దమతమ గూళ్ళనుండి. 88

సీ. జాఱిపోయిన నీవి సవరించి సవరించి
కులుకుగుబ్బల పైకఁ గుమురుపఱచి
వీడిపోయిన కొప్పు బిగువుగా ముడివైచి
సొగసుదప్పటి మేల్ముసుంగు వెట్టి

చెలికానితోడను జెప్పలేకే చెప్పి
మోహమ్మున మతొక్క ముద్దువెట్టి
చనలేక యొకకొంత సాఁగి వెన్కకుఁ జూచి
మనములోఁ గాఠిన్యమును వహించి

తే. గీ. సంతసం బొక్కవైపు విచార మొక్క
వైపుఁ బెనఁగొన 'నీలాటిపనుల నోస
రింపఁగా వలె' నని నక్క తేలకాయ
రీతిఁ గవి చనె జారనారీజనంబు. 89

చ. చనుటకు నుద్యమించుఁ, "జన శక్యముగా" దని పవ్వళించు, మిం
చినతమిఁ గౌఁగిలించు చెలిచేతుల దూరముగాఁగ నుంచుఁ, జ
య్యనఁ దలవంచు, నుస్సురని యాత్మవిచారమునందు ముంచుఁ దా
వనితను బాయునప్పు డొక పల్లవుఁ డుల్లము తల్లడిల్లఁగన్. 90

చ. వలపు దలిర్పఁగాఁ బ్రియునివక్షమునం బవళించి నిద్రచే
నలసత గానుపింప వెలయాండ్రు కలల్ గులుకంగ మేలుకొ
ల్పులఁ దగఁ బాడఁగా నిదురపూనికతో విరుపూనిలేచి సం
దులఁ గడుగోప్యమై తనరుత్రోవలఁ బోయిరి చాటుపల్లవుల్. 91

తే. గీ. లేపి పల్లవులను బంపి, లేఁతప్రాయ
మలరు తమకన్నియలఁగూడ మెలఁకువఁగనఁ
జేసి వీణియశ్రుతిఁ జేసి చెప్పఁదొడఁగి
రపుడు గీతమ్ములను వృద్ధలౌ గణికలు. 92

సీ. కించిద్వికసదబ్జచంచదంచచ్చంచ
రీకదంపతుల సస్పృహలఁ జేసి
సమరతావధిఁ బృథక్శయ్యాస్వపద్దంప
తుల నొక్కశయ్యపైఁ గలయఁ గూర్చి
యుపరతక్రీడామహోత్సవాలసకామి
నీకుచస్థలఘర్మనీర ముడిపి

సంకేతితస్థలస్థనవపత్రిసవతల్ప
గతపరిమళముతోఁ గలసి మెలసి

తే. గీ. అమితతృష్ణార్దితభుజంగసముదయప్ర
మదవిధానాతికుశలసంపదలఁ బొదలి
మలయనిలయపటీరద్రుమవలయనిలయ
మారుతములు ప్రభాతసంపదలఁ దెలిపె. 93

తే. గీ. తత్తదుద్యానవనఫలతతులు మేసవి
యినుఁడు రాఁ బోవుచున్నవాఁ డనియెఱింగి,
పరువుపరువున నన్నియుఁ బక్కిగట్టి
తమతమ నివాసములకు ఘూకములు నేరె. 94

తే. గీ. క్రమముగా జాఱె రాత్రి, సరస్తటప్రి
దేశములఁ జేరి తెల్లవై దికవతంసు,
లరుగఁజొచ్చిరి పాంథులు దురముదనరఁ
దారక లడంగెఁ, జంద్రుఁ డస్తరుచియయ్యె. 95

సీ. పద్మినీవిరచితాపారపుణ్యోదయం
బుత్పలిన్యాప్తపాపోచ్చయంబు
కోకీప్రియాగమాస్తోక ముహూర్తంబు
ఘనహిమానికిఁ బెద్దకారుమెకము
సురతసంతోషవిస్ఫురణమ్మునకు జెమ
మతనుతాపమ్మున కౌషధంబు
ఆవాలముల పన్ను లార్జించుకరణమ్ము
చీఁకటిపాలిటి చీఁడపురువు

తే. గీ. భువనజాతంబు లేమెడఁ బ్రోచుపోఁడ,
మూఁడుమూర్తులు నివసించు మేడ, జగము
పాలిటి సులోచనం, బహర్పతి క్రమమ్ము
గా నుదయమందెఁ గన్నులకఱవు దీఱ. 96

శా. స్నానంబుల్ పచరించువారు జపముల్ సంధించువా రగ్నిస
మ్మానంబుల్ నెఱవేర్చువారుఁ దరణిం బ్రార్థించువా రాత్మని
ధ్యానంబుల్ పొసఁగించువారు నిగమధ్వానమ్ములం జేయువా
రానందాబ్ధినిఁ దేలువారలునునై రప్డెల్లరున్ వైదికుల్. 97

శా. ప్రాతఃకృత్యముల్లన్ యథోచితముగాఁ బాటించి పొత్తమ్ములన్
జేతం బూని నవీనపాఠమును నిశ్శేషమ్ముగాఁ జూచి తా
మా తాత్పర్యము గొంత కొంత మదిలో నానించి విద్యార్థు లెం
తో తాత్పర్యముతోడ దేశికులఁ గన్గోఁ బోయి రప్పట్టునన్. 98

క. మౌద్గల్యసగోత్రభవా!
సాద్గుణ్యవిచార! ధనదసమధికవిభవా!
హృద్గతభవా! సుకవితా
విద్గణ్యప్రాభవా! ప్రవీణాగ్రభవా! 99

క. గణనాతీతగుణశ్రీ
చణ! కవితారమణ! సరససాహిత్యరసో
ల్బణ! చరణాయుధరూప
త్రిణయన పదసేవనాధురీణ ధురీణా! 100

స్రగ్విణి. కామమాఁబాలసద్గర్భపేటీమణీ
దామముక్తామణీ! ధామభాస్వన్మణీ!
సోమధామోపలస్యూతసౌధాంతరా
రామరాజాధిక ప్రాజ్యభాగ్యోదయా! 101

— గద్య —

ఇది....శ్రీ తిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబైన
కేవలకల్పితంబగు శ్రవణానందంబను మహా
ప్రబంధమునందుఁ దృతీయాశ్వాసము.

శ్రీ ర స్తు

శ్రీమత్పరదేవతాయైనమః

# శ్రవణానందము

## చతుర్థాశ్వాసము

క. నూత్న ప్రఖ్యాతిజిత
ప్రత్నధరానాథమంత్రిరత్న! సుకృతకృ
ద్యత్నదృఢచిత్త! వేంకట
రత్నామాత్యమణి! విబుధరాడ్రాజమణీ! 1

వ. అవధరింపు మనంతరంబు. 2

క. మెల్లన మేల్కాంచి యతం
డుల్లములో నుండు వికృతి యొరుల కెవరికిం
దెల్లము గాకుండఁగ నం
ఫుల్లవదనుఁ డగుచుఁ గాలమును గడపుచుఁ దాన్. 3

క. ఏదియుఁ దోఁచక కడుఁ బెం
పేది ముదముఁ దక్కి "యెట్టు లీమోహజలం
బీఁదుదుఁ గర్తవ్యం బిఁక
నేది?" యని మనమ్ములోన నెంతయు వగతోన్. 4

ఉ. ఈవిషయంబు మానుకొనుటే కడుసౌఖ్య మటంచు నెంచి తా
నావిధిఁజేయ నిశ్చయము నందిన యంతనె మోహ మగ్గలం
బై వెనువెంట నంటు; నటులైనను జేయుదు నన్నతోడనే
భావము వేనవేలు ప్రతిబంధకముల్ గనఁజేయు నెంతయున్. 5

క. మానుదునా! చేయుదునా!
మానుదుఁ జేయుదు నటంచు మల్లాది యొగిన్

మానిన విచార మొక్కఁడె,
పూనియొనర్చిన విచారములు పెక్కులుగా ! 6

క. అని తనమదిలో ననుకొని
యును బుద్ధినిఁ ద్రిప్పలేక యొగి నుత్తర మ
క్కనకాంగికి లిఖియింపుట
కును బ్రారంభించెఁ గొంత కొంత తెగువతోన్. 7

మ. రణదుద్యన్మణికంకణక్వణజితప్రద్యుమ్నకంఖాణికిన్
గణనాతీతకలాలసద్భ్రమణికిన్ గాదంబినీవేణికిన్
గణికోద్యన్మణికిన్ బ్రిశస్తతరరేఖాపాణికిన్ బాలికా
మణికిన్ వక్త్రజితాబ్జశీతఘృణికిన్ మాద్యత్పికీవాణికిన్ ! 8

క. అనవద్యయౌవనోదయ
ఘనరసికసమాగమాధికసుఖోదయనం
దనధనములు గలుగఁగ దీ
వన లిడి నా వ్రాయు వ్రాఁతవల నెట్టిదనన్. 9

క. కడుమాట లేల ? విను, లోఁ
గడ మాకుఁ గలానిధిత్వకారణమునఁ జం
ద్రుఁడు బంధుఁడు నీకై కద !
జెడిసెం జంద్రునకు మాకు విమలేందుముఖీ ! 10

క. కలువలజేనికి వేఁడిమి
చిలువకు విశ్వాస, మగ్నిశిఖకును శైత్యం
బలవడునుగాక, వెలకాం
తలకు వలపు గలుగు టది వినంబడదు కదా ! 11

తే. గీ. అట్టిగణికాకులమ్మునఁ బుట్టినట్టి
దానవే కద ! నీవును దరుణి నీకు
వలపు గలదన్న మూర్ఖునివంటివాఁడె
నమ్మనేరఁడు; నే నెట్లు నమ్మనేర్తు ? 12

క. నిజమయిన వలపు గలుగని
గజగామినిఁ గవయువానికన్న నధముఁ డీ
త్రిజగతి లేఁ; డదియ యనం
గఁజను రసాభాస మనఁగఁ గాంతామణిరో! 13

క. ధనమును గులమును వృత్తం
బును రూపముఁ జూతు రెందు బోటులు; మీలోఁ
బని లేదు తక్కినవి యొక
ధనమె ప్రధానమ్మ గదవె తరుణీమణిరో! 14

తే. గీ. కోరితివి నన్ను; నాబోఁటిధీరుఁ గోరి
యేమిసంపాదనముఁ జేసెదే లతాంగి?
ధనము గల్గినవాని నొక్కని వరింపఁ
దగు నదియ కాదె నీ కులధర్మ మరయ? 15

క. ఇదియంతయు నీమదిలోఁ
బదిలముగా నూహ చేసి వ్రాయవలెఁ జుమీ!
తుది నిష్ఠురంబుకన్నను
మొదటనె నిష్ఠురము మేలుఁగు పూర్ణేందుముఖీ! 16

క. అని వ్రాసి పంపె నంతట
దినకరుఁ డస్తాద్రి కేగెఁ దిమిరము ప్రబలెన్
వనజాహితుఁ డుదయించె మ
ఘనుఁడు పథికసతులమనముఁ దల్లడపఱచెన్. 17

క. ఏమియుఁ దోఁచక యవ్వని
తామణి యున్నంతఁ గమ్మ తారసిలుటయుం
బ్రేమ దలిర్పఁగఁ జూచి మ
హామోదముఁ జెంది తల్లి కంతయుఁ జెప్పెన్. 18

వ. తల్లియు సంతసించి "జాగు సేయక వినయపూర్వకమ్ముగాఁ బ్రత్యు
త్తరముం బంపు" మని చెప్పుటయు నక్కన్నెమిన్న. 19

క. ఏమని వ్రాయుదు సీతని ?
కేమని వ్రాసినను సీతఁ డియ్యకొను ? నటం
చీమాడ్కిని యోజింపుచుఁ
దా మెల్లన నిట్లు వ్రాసెఁ దగునై పుణితోన్. 20

వ. శ్రీ మదుభయవేదాంత ప్రవర్తకులగు మధుసూదనాచార్యులవారి సన్నిధికి దాసురాలగు బాలామణి సాష్టాంగంబు లొనర్చి కుశలోపరి వ్రాసికొను మనవి. 21

క. నిన్నటిరాతిరినుండియుఁ
గన్నులుదీసికొని యెదురు గనుఁగొనుచును నే
నున్నతఱి మీర లంపిన
విన్నాణపుఁగమ్మ మదికి వేడ్క లొసంగెన్. 22

శా. తాపం బాఱె, విచారమా సడలెఁ, జిత్తంబా మహానందవి
ద్యాపారమ్యముఁ గాంచె, దైన్యగుణమా దౌదవ్వులంజేరె, నా
శాపాశం బతిదీర్ఘమై భవదపేక్షా వృద్ధిఁబొందించి యా
టోపప్రక్రియ నొప్పెఁ బూవిలుతుబంటుల్ నాకు బంట్లైరిఁకన్. 23

క. ఇందుకు సందియమును మీ
రందం బనిలేదు మీర లంపించిన క
మ్మం దగఁ గైకొని బ్రహ్మా
నందభరితురాల నైతి నానాగతులన్. 24

క. మిముఁ గోరిన దెందులకో
తమ రెఱుఁగుదు, రే నెఱుఁగుదు, దైవ మెఱుంగున్
సుమబాణుఁ డెఱుఁగు నిది ని
క్కము మీసందియముఁ బాపఁగానేరుతునే ? 25

ఉ. నాయెడఁ బ్రేమ లేనికతనం దమకన్నియు సందియమ్ములే
పాయక తోఁచుచున్నవి సెబా ! సిఁక మి మ్మన నేల ? మీమనం
బా యరవిందసంభవుఁడె యట్టు లొనర్చిన యప్పు, డింతకుం
గాయజుఁ డేమి సేయ సమకట్టెనొ ? మీమదిఁ ద్రిప్పనేర్తునే. 26

క. "రవి కెఱుఁగ రాని దైనను
గవు లెఱిఁగెద" రంచుఁ జెప్పఁగా విందుము స
త్కవులైన భవాదృశు లొక
యువిదమనస్థితి నెఱుంగు టొకకష్టంబే? 27

ఉ. కోరినయంతమాత్రమునఁ గోరికతీరు గ్రహించి యెక్కడో
గౌరవబుద్ధిఁ జూచి కనుగందఁగనీక సమస్తరీతులం
జేరికఁ జేసి పంతమును జెల్లఁగఁజేసెడి నాయకుండు చే
కూరఁగ నోఁచినట్టి సుమకోమలినోము లవెట్టినోములో! 28

ఉ. ఏలిన నేలుఁగాక జగమెల్లను, రూపమునందు మన్మథుం
బోలినఁ బోలుఁగాక; పలుభూషలు వెట్టినఁ బెట్టుఁగాక! యే
కాలమునందుఁ గాని రసికత్వపుసంపదచేఁ గవీంద్రులం
బోలెడివార లీ జగతిఁ బుట్టి రటన్న ప్రసిద్ధి వింటిమే? 29

చ. కవు లొనరించు గ్రంథములఁ గాంచిన వారలె యెక్కడో రస
జ్ఞవరులమంచు నిక్కెదరుగా! యటువంటి ప్రబంధముల్ విలా
సవిధి రచించునట్టి కవిచంద్రుల కెట్టి రసజ్ఞతావిశే
షవిలసనంబు గల్గునో విచార్యము గాదె స్వతంత్రురాలికిన్! 30

చ. ఇదియొకకారణం; బిదియు నిట్లనె యుండఁగనిండు; మీకుఁ జె
ప్పఁదగినదానఁ గా, నయినఁ బల్కెద, నొక్కతె కొక్కపూరుషుం
గదిసినయంతమాత్ర మది గల్గును, వేఱొకఁ డంతకన్నఁ దాం
బదిపదిరెట్టు లెక్కుడగు వాఁడయినన్ మదిపుట్టనేర్చునే? 31

ఉ. కావున నీక్షణంబ తమకమ్మున వచ్చి యనుగ్రహించి నన్
బ్రోవఁగఁ గోరెదం దమకుఁ బుట్టెడి శంకలకున్ సదుత్తరం
బావల నిచ్చెదం గడుఁ గృపాకరులై క్షమియింప వేఁడెదన్
దైవము సాక్షి యింతయును దథ్యమటంచును వ్రాసి పిమ్మటన్. 32

చ. రవి మెఱుఁ గాయె నక్కలువరాయనికన్న, నిదేమి పాపమో
పవనునికన్న నామదికిఁ బావకుఁడే మెఱుఁగాయె నక్కటా!

శివశివ! వేయిమాట లిఁకఁ జెప్పఁగ నేటికిఁ! జిత్తజాతసం
భవమగు నాయవస్థ భగవంతుఁ డెఱుంగును నే నెఱుంగుదున్. 33

వ. అని వ్రాసి యంపిన నమ్మధుసూదనుండును. 34

చ. రయము భయమ్ము సంభ్రమము రక్తి విరక్తి నిరాదరాదరో
దయనయముల్ మదిం గదిసి తత్తదుపాధులఁ బుట్టఁజేయ నొ
క్కయెడ రహస్యరీతి నది గాంచి పఠించి తదీయభావని
శ్చయ మొనరించియుం జదువసాఁగుఁ బునఃపునరాదరంబునన్. 35

క. కను మరలం గను మరలం
గను మరలం గను నతండు గాంక్షదలిర్పన్
వనజాయతలోచన లం
పినవార్త లవెంతకైనఁ బ్రేమాస్పదముల్! 36

తే. గీ. ఇట్లు లాకమ్మఁ గని కని యెట్ట కేల
కా సరోజాక్షిపొందు సేయంగ నిశ్చ
యించి తగురీతి నట కేగుదెంచుటకును
బయలువెడలె నిశీథసమయమునందు. 37

మ. ఒకకొం తేగును, సంశయించును; సముద్యుక్తత్వముం జెందు, వే
ఱొకకొం తేగు, యథాస్థితింగను; నిరుద్యోగమ్ము పాటించు; నిం
టికిఁ దోతెంచుట కూహసేయు; నిటు లెందేఁ గంటిమే వింత! వి
ద్యకదా, హేతు వతండు సంశయసముద్రాంతర్గతుం డౌటకున్! 38

మ. మనుజుండై జనియింపరాదు, జనియింపంగల్గినం బాండితీ
ధనుఁడై యుండఁగఁ బోల, దట్లయినచోఁ దప్పేమి? యవ్వాఁడు పుం
స్త్వవిరూఢిం గనఁబోల, దట్లయిన నవ్వాఁ డంగనాకామియై
చనరా దొండెడ, కట్టులైనను రహస్యప్రక్రియల్ గూడునే? 39

ఉ. "ఎవ్వరు గందురో మఱియు నెవ్వరు విందురొ యేమనందురో
యెవ్వరు పల్కరింతురొ మఱేమొ?" యటంచును సంశయించు వాఁ
డివ్వసుధం బరాంగనల నెట్టులఁ బొందఁగనేర్చు? భోగపుం
జవ్వని పొందు సేయుటయె సాధ్యము గా దటువంటివానికిన్. 40

క. కఱచెడిపాము మీఁదం
బఱచెడిభూతంబు నెఱుఁగఁబడక మనము ని
బ్బరముగఁ దిరిగెడి గరకరి
బిరుదులె పో! జారకృతికిఁ బెట్టినపేరుల్. 41

సీ. చూపట్టునట్టివస్తువు లెల్లఁ దనుఁ బట్టఁ
గావచ్చు వారంచుఁ గాంచకున్నె?
వినవచ్చునట్టినిస్వన మెల్లఁ దనుఁ బల్కి
రించు పల్కు లటంచు నెంచకున్నె?
ఎడనెడ నడచిపోయెడివారలెల్లఁ దన్
జూచువారలె యంచుఁ దోఁచకున్నె?
అగుపట్టునట్టిగృహమ్ము లన్నియుఁ బ్రియు
రాలివే యని శంక నందకున్నె?

తే. గీ. అహహ! క్రొత్తగ వ్యభిచార మాచరింపఁ
బోవుచున్న రహస్యపుఁ బురుషులకుఁ ద
టస్థమగునట్టి యీ దురవస్థ శత్రు
వర్గమునకైన వలదురా! వలదు వలదు. 42

వ. ఇట్లు సంశయించుచుఁ దుదకుఁ జనఁజాలక కాలయాపనంబునకై
యొకసుహృద్గృహమ్మునకుం బోయి యటఁ బరుండుటయు. 43

చ. దొరకిన పెన్నిధానమును దొంగల కిచ్చినరీతి నాతఁ డీ
వరుసఁ బరుండి యుండ, గుణవంతుఁ డనం జను నొక్కమిత్రుఁ "డీ
కరణిఁ బరుండనేమి?" యని గట్టిగఁ దన్నడుగంగ నాతఁ డా
దరమునఁ జేతి కిచ్చె నల తన్వి లిఖించినయట్టిపత్రికన్. 44

క. ఇచ్చి "భవత్తాత్పర్యం
బచ్చొత్తినరీతిఁ జెప్పనగు" నన నతఁ డీ
సచ్చరితున కిది తగదని
చెచ్చెరఁ దలపోసి హితముఁ జెప్పఁ దొడంగెన్. 45

చ. "కులమును బ్రాయమున్ యశము గోవిదభావము భాగ్యవత్తయుం
చెలువము సత్త్వవర్తనముఁ జేతికి మించినయట్టి యోగియుం
గలిగిన మిమ్ము నొక్కవెలకామిని గోరుట కబ్బురంబె, మి
మ్ముల విననంత నే చెలికిఁ బుట్టకయుండు మనోవికారముల్? 46

ఉ. చిన్నతనమ్మునుండియుఁ బ్రసిద్ధివహించి జగంబునందు బల్
వన్నెకు నెక్కఁగల్గు తగువర్తనచేఁ జరియించునట్టి మీ
రన్న, మహానుభావులు గదా? తమబోఁటులె యిట్టులైనచో
నన్నటువంటివార 'లిది యుక్తమొకో' యని సంశయింపరే. 47

సీ. తల్లిదండ్రులు విన్నఁ దప్పుగా గణియింతు
రత్తమామలు విన్న నాదరింప
రూరిపెద్దలు విన్న గారవింపరు, మాట
వినఁదగువారును వినరు, తనకుఁ
బ్రాణమిత్రులుగూడఁ బరిభవింపఁగఁ జూతు
రాలు చులకనఁజేసి గాలిజేయుఁ
దననవుకరుఁగూడఁ దన్ను హేళనఁ జేయు
నన్న నన్యులమాట లెన్న నేల?
తే. గీ. ధనము చెడుఁ, గీర్తిచెడు, దేహమునకు లేని
పోనిదురవస్థ గల్గును గాన విత్త
కాంతలనుగూడువారి కొక్కయెడనైన
నగుపడదు సౌఖ్యము విచార మడుగవలెనె? 48

వ. ఇదియునుంగాక, 49

సీ. అర్థ మిచ్చినయప్పు డతిగౌరవము సేయు
నర్థ మీకున్న మూఁడంకె వేయుఁ
గాసు లిచ్చినఁ గాళ్ళ గడిగి నెత్తిని దాల్చుఁ
గాసు లీకున్న బింకాలఁ జూపు
లంచ మిచ్చినను లాలించి ముద్దులు పెట్టు
లంచ మీకున్నఁ జిట్లించు మొగము

నగలు దెచ్చినయప్డు వగ లెన్నియో చూపు
నగలు తేకున్న నావగలు సున్న

తే. గీ. చీర లిచ్చినయప్డు హర్షించి చూచుఁ
జీర లీకున్న యప్డు గుంజించి చూచుఁ
గంచుకాఁగడ వెలిఁగించి కనినఁగాని
వలపు గన్పట్టునే వారవనితలకును ? 50

తే. గీ. వన్నె చిన్నెలుగల గొల్లకన్నెముంత
సర్వజనులును ద్రొక్కు బజారుసంత
అందఱును నేగ నేమించినట్టిపుంత
వంతలకు వింతదొంతర వారకాంత. 51

ఉ. ఏరికినైనఁ గూడవు ధనేచ్ఛఁ జరించెడి వారకామినీ
చారు కుచోపగూహనవిచారము లన్నపు డుత్తమోత్తమో
దారయశోవిశేషపరిధానవిభూషితసర్వదిక్సతీ
వారు లనంగ నొప్పు తమవంటిమహాత్ముల కర్హ మెట్లగున్ ? 52

మ. గుణవంతుండనునోట "ముండలముటాకో" రీతఁ డంచున్ బుధా
గ్రణు లాక్షేపణఁ జేయఁబూనుదురు; చుల్కంజేసి మాటోఁటులున్
గణనంజేయ రటంచు మైత్రి నిటుఁ బల్కంబూనితిం గాని వా
గ్రణముం జేసి మరల్తురే ? హరిహరబ్రహ్మాదులైనన్ మిమున్. 53

క. ఐనది కాదని యనఁగాఁ
గానిది యౌనని వచింపఁగాఁగల మీతో
నేనా, వాదము చేయుట ?
యేనూఱుగురైన మీకు నెదురే ? చెపుడీ." 54

క. అని యాతఁడు పలికిన, ని
ట్లను, "మీతోఁ జెప్పి మంచి యగునో, కాదో
వినఁగోరి యడిగితిని మం
చి నిదానమ్మగను మీరు చెప్పితిరిసుఁడీ. 55

క. తన కెంతతెలివి కలిగినఁ
దనకార్యముపట్లఁ దానె తగుదు ననుట యొ
ప్పనిపని; యోగ్యతగలిగిన
తన మిత్త్రుల నడుగు టొప్పుఁదగవరి కెందున్. 56

ఉ. ఇంతియ కాక మీ రెఱుఁగరే ? ననుఁ జిన్నటనాఁటనుండి యీ
వింతలలోని కెన్నఁడును వేడుకఁ జేసి మనంబుఁ జొన్ప; నీ
కాంత యదేమొకాని నను గాసిలఁజేయుచునున్న దందుచే
నంతయు మీకుఁ దెల్పి తెలియన్ వినఁగోరితి మంచిపెద్దలా." 57

క. అని యతఁడు చెప్పునీతులు
విని యప్పనిపట్ల నితఁడు విముఖుం డాయెన్;
ఘనులగు మిత్త్రులు గలిగిన
మనుజులు దుర్వ్యసనములకు మఱుగుట గలదే ? 58

సీ. 'ఇప్పుడే వచ్చునో, యిఁకనె వచ్చునో' యంచుఁ
దలవాకి లిల్లుగా నిలిచి నిలిచి
'వచ్చువాఁడైన నీవఱ కేల రాకుండు ?'
నని మనమ్మున శంక నంది యంది
'నేను వ్రాసినకమ్మ నిజముగాఁ జూచెనో,
చూడలేదో' యటంచు సొక్కిసొక్కి
'రాకుండునా ? యిప్పు రాత్రి యెంతో ప్రొద్దు
పోలే' దనుచు మదిఁ బొక్కిపొక్కి

తే. గీ. యున్నకన్నెను మరుబారి నుంచివైచి
స్నేహితునిమాటలకుఁ బ్రతిఁ జెప్పలేక
చనక యచ్చోట నిద్రింపసాఁగె నతఁడు
నిదుర యేరీతిఁబట్టెనో? మది యెఱుంగు. 59

ఉ. ఇంతకుమున్నె యప్పనిత యెంతయు సంతస మంది 'మన్మనః
కాంతుఁడు నేఁడు రాఁగలఁడుగా!' యని భూషణభూషితాంగియై

వింతగఁ గేళికాగృహము వేగ నలంకృతిఁ జేయఁ జేసి 'యే
మింతఁగఁ గాలయాపనము నీతఁ డొనర్చె' నటంచు నెంచుచున్.

చ. వడివడి వచ్చువానివలె వార్తను బంపియు నింతరాత్రి దాఁ
గడచినమీఁదనైన నిటఁ గాలిడఁ, డెంతటి సత్యవాది యీ
తఁడు ! నను నింతచుల్కఁగ నెదన్ గణియించునె? వచ్చెనేని, నే
నడుగక యుందునే ? మనమునందలికోపముఁ దీర్పకుందునే ? 61

క. అని కనులు దీసికొని యా
తనిరాఁకకు నెదురుచూచుతనయుం గని నె
మ్మనమున విసువు దనర న
వ్వనజాననతల్లి యిట్లు పలెకెం బిలుచన్. 62

ఉ. ఓతలిరాకుబోఁడి ! వినవో ! నిజ మొక్కరివంటివాఁడు గాఁ
డాతఁడు, వచ్చునే మనగృహమ్మున ? కాతనియందుఁ గాంక్ష నీ
చేతమునందు గట్టిగ వసింపుచు నుండిన నేను జెప్పు నీ
రీతిగఁ జేయు మాతఁడె వరించి గ్రహించు నినుం గ్రమమ్ముగన్.

క. చనువను నొకమిషఁ బూని ప్రి
తిదినమ్మును నతని సన్నిధికి నేగినచో
మదిఁ జనవు హెచ్చి క్రమముగఁ
బధునుచెడు న్నిక్క మిది యుపాయము సుమ్మీ. 64

క. వచ్చుట కాతనిమదిలో
నిచ్చ వొడమెఁగాని యిచటి కేతెంచెడి యీ
ముచ్చట లన్యులు గన్నను
జచ్చినచావగు నటంచు సంశయపడియెన్. 65

చ. క్రమముగఁ గొంతకాలము గరమ్ము రహస్యముగాఁ బ్రవర్తనం
బమరినమీఁదఁగాని "యెవరైన నను గాంచెదరేమొ" యంచు శం
క మొదటఁ దోఁచు నెట్టివిటకాండ్రకు నన్నపు, డెప్పు డిట్టి క
ర్మముల నెఱుంగనట్టి జనమాన్యులు సందియమందకుందురే ? 66

తే. గీ. క్రమముగాఁ గొంతసఖ్యమ్ము గలిగెనేని
వించు రందఱు, నాఁమీద వినుచు లజ్జ,
"నలువురు వినెడిదాఁకనె గలుగు సిగ్గు,
నడుము మునిఁగెడివఱ కలవడును జలియు" 67

తే. గీ. ఇటులఁ దనపుత్రికకుఁ గార్యఘటనకు సదు
పాయ మెఱిఁగించి నిద్రకుఁబడియె వృద్ధ;
అటుల నొనరింప నక్కన్నె యనుమతించి
యెపుడు తెలవాఱు నని మది నెంచునంత. 68

ఉ. కొక్కరుకొక్కరో యనుచుఁ గుక్కుటముల్ పలవించె, నంతలోఁ
జుక్క పొటుక్కనం బొడిచె; సుందరమంథరగంధవాహముల్
నిక్కెఁ; దమంబు నుగ్గె; నళినీసతికిన్ రుచు లెక్కె; నొక్క పై
జక్కవ లార్తిఁ దక్కెఁ; జలజప్రియుఁ డెక్కె సురేంద్రుదిక్కుపై.

సీ. కలుము లీనెడి కన్నుఁగవ వీథినల్లకల్
నల్లగల్వలతోరణములు గట్టఁ
గారుకమ్ములు గ్రమ్మఁగాఁ జాలు వేణికా
రుచులు తుమ్మెదలబారులు ఘటింప
సహజదరస్మితస్వచ్ఛకాంతులు దంత
ములకాంతిఁగూడి వెన్నెలలు గాయఁ
దళతళల్ మీఱు గుత్తపుఁజన్నుఁగవపొంగు
తోరణఁ గన్పడువారిఁ దొంగిచూడఁ

తే. గీ. బ్రతిదినము పూఁట కొకసారి పనినిబూని
యతనిసన్నిధి కేతెంచు నదిమొదలుగఁ
బుస్తకము హస్తమునఁ బూని పొలఁతి యొకతె
తనకుఁ జేఁదోడువాఁదోడుగను మెలంగ. 70

చ. తమనుతు నూత్న యౌవనవిధమ్ము నెఱుంగరొ? వారకామినుల్
కుమతు లటం చెఱుంగరొ! చెలుల్ మఱి యెంకటివారినైన మో

హామయులుగా నొనర్తురను నంశ మెఱుంగరొ! తల్లిదండ్రు లు
త్తము లనరాదె? వేఱొకవిధం బయినన్ మఱి సమ్మతింతురే? 71

చ. ఒకరకమైన పావడ మఱొక్కరకంబగు తైకయున్ మఱిం
కొకరకమైన పైఁటయు మఱొక్కరకంబగు భూషలున్ ధరిం
చుక ముకురంబుఁ జూచుకొని సొంపుగలేదని యెంచి, యంత వే
ఱొకటి మఱొక్క టింకొకటియున్ ఘటియించు నతేగువేళలన్. 72

వ. అట్లు వచ్చి.

చ. చదువనుపేరెగావి యొకసక్కెపుమాటల నాడుచుండు, సం
దొదవినయప్పుడెల్ల నెదియో యొకసంగతి దెచ్చి "పండితుల్
మొదలె యబద్ధమాడెదరు, మోసముచేతురు వారినమ్మ టొ
ప్పదునఁడి" యంచుఁబల్కి తలవంచినగుణ్ మొగమెత్తుఁగ్రమ్మఱన్.

చ. పలుచనిపండుటాకులకు బాగుగ నీనెలుడీసి చక్కఁగాఁ
జిలుకలుచుట్టి దొంతరలుచేసి యమర్చి కరాంగుళీదళం
బుల నిఱికించి తెచ్చి వలపుల్ మొలపించుచు నిచ్చి యంతటం
బలుకును జిల్కపల్కులను వ్యంగ్యపురంగు చెలంగి పొంగఁగణ్. 75

శా. ఎంచు న్మర్మము లెత్తి మాటికిఁ, దుటాయించుం గనుల్, బల్మిటా
రించుం జన్గవపై చెఱంగు, వల పూరించున్, నగించున్, బ్రిశం
సించుణ్, మించుమనోవికారమును సూచించున్ మరుల్ వెంచున
మ్మించుంబోఁడిస్వభావమో? యతని నమ్మించన్ బ్రియత్నించుటో?

చ. ఎడపక యెల్లవేళ మఱి యెప్పుడు చూత మటన్నఁగాని య
క్కడనె వసింపుచుండుటయ కాని యొకానొకవేళనైనఁ దాఁ
దడయక యింట నుండినపథం బది యెట్టిదియో యెఱుంగ ద
ప్పడఁతుక, దానిచిత్తమును బట్టిన భూత మదెట్టిదో కదా! 77

సీ. ఒకమాఱు మనుచరిత్రకథాంశమున వరూ
ధిని మరుల్ సెందుపట్టునను జనవు
నొకమాఱు నాయికాదికచేష్ట లెఱిఁగించు
రసమంజరీరసప్రసృతిఁ జనవు

నొకమాఱు నభినయప్రకటీకరణచణా
భినయదర్పణరసాభిరతిఁ జదువు
నొకమాఱు గానవిద్యోపయుక్సారసం
గ్రహముఖ్యగ్రంథసంగతులు చదువుఁ

తే. గీ. గ్రొత్తక్రొత్తలు జావళీల్ క్రొత్తక్రొత్త
పదములును గ్రొత్తక్రొత్తలౌ వర్ణములును
నింపు దళుకొత్తఁగోరి రచింపఁ జేయు
నేమి చెప్పఁగవచ్చు ? నయ్యింతిచర్య. 78

ఉ. ఆ పగలాఁడి వచ్చువఱ కాతఁ డనంతవిషాదవేదనల్
భావమునందుఁ జెందు; నటుపైఁ జనుదేరఁ గ్రమక్రమమ్ముగాఁ
జేవ మనమ్మునం దగులఁ జేయును గాని మనోవికారసం
భావన బైటఁ బెట్టఁ డఁట ! బాపురె ! యాతనిభావ మెట్టిదో ! 79

ఆ. వె. ఆ సరోజనేత్ర యరుదెంచువఱకె సం
తాప మతని, కా లతామనోజ్ఞ
అరుగునంతవఱకె యామోద మీగతి
నరిగెఁ గొన్నిదినము లంతలోన. 80

ఉ. వేసవి వచ్చె భాస్కరనవీనగవీనమితామితాచ్ఛగు
చ్ఛాసవవాసనైకవలనాకలనాకులనాయికాసము
చ్ఛ్వాసనశాసనాదికృతిఝంకృతిసంకులషట్పదావళీ
భాసురశుష్కపుష్పవిటపప్రకరప్రతిభాపరిమోదమై. 81

సీ. సూనబాణుని కేళిఁ జొక్కి యక్కున వ్రాలు
ప్రియురాండ్ర బైఁటచే విసరువారు
విసరినందులకునై కొసరి యింకొకసారి
వెడవెడపనుల కొప్పించువారు
నొప్పించినను నొప్పుకున్న క్రొన్ననబోణు
లను "మాబదులు దీర్పు" మనెడివారుఁ

దీర్చుకొమ్మన్న విదిర్చి శయ్యను డిగ్గి
చనువారిఁ గని ముద్దుఁ గొనెడివారు

తే. గీ. ముద్దుఁగొని సుద్దులను గొంతప్రొద్దు జరపి
మలయవాయువు లిరువురఁ గలకదేర్పఁ
గలయఁదమకించి కోడికూఁతలకుఁ దలఁకు
వారలై రఁట గ్రీష్మవిభావరులను. 82

చ. వదలినఁ జచ్చిపోదు మనువారలు తక్క సమస్తదంపతుల్
పొదలెడి గ్రీష్మతాపమును బొంది సహింపఁగలేక తెల్లవా
ఱుదనుక వేఱువేఱుగఁ బరుండి నిశాంతసమీరపోతసం
పద లొలయంగ నైక్యగతి వర్తిలఁ బూనుదు రట్టివేళలన్. 83

ఉ. వేసపితాప మిట్టి దని వేమరు నొక్కి వచింప నేల ? యా
యాసము నొంది తాపమున కాఁగఁగ లేక రమావిభుండు దా
వాసముఁ జేసె నంబుధి నివాసముఁ జేసె నుమేశుఁడున్ హిమా
నీసముపేతపర్వతవనీతటినీతటకుంజమండలిన్. 84

చ. ఇతరుల దాహపుం గతుల నెన్నఁగ నేల ! దినేశు నంతవాఁ
డతితరతృష్ణచేఁ దన సహస్రకరమ్ములు సాచి నేమపుం
గతి విడనాడి గుంటలనె కాదు, నదమ్ములఁ గాదు, కూపసం
తతులనె కాదు కంటికి గనంబడి నంతయుఁ ద్రావె నీరమున్.

ఉ. అట్టి బెడంగుకాఁక నలరారి వెలింగెడి గ్రీష్మతాపసం
ఘట్టనకున్ స్మరాగ్ని యలుకం గని దాని జయింతు నంచు బల్
పెట్టతనంబు పూని కడు వృద్ధినిఁ జెంది వియోగతప్తులం
బట్టి పలార్చెఁగాని పరిపంథినిఁ బట్టి పలార్ప నేర్చెనే ? 86

శా. వచ్చెం బ్రోషితభర్తృకాంగనల తాపం బార్పఁ బెన్గానలం
జిచ్చుల్ మాయఁగఁ జేయ సస్యములకున్ జేయూఁత గైసేయ వి
ద్యుచ్చంచద్ఘనమాలికానినదభీత్యుద్వేజితస్వాంతయో
షిచ్చారూన్నతమాంసలస్తనభరాశ్లేషంబు వర్షర్తువున్. 87

తే. గీ. వాన కేళీగృహమ్ములు వదలనీదు
చలి తమంతనె కౌఁగిలింతలను దార్చు
మబ్బు రాత్రిందివమ్ముల మాటుపఱచు
వర్షఋతువంత దేది ? దంపతులదాది. 88

క. బోరునఁ బడియెడివర్షా
సారంబులు వహ్ని నపుడు చల్లార్పంగాఁ
జారుస్త్రీకుచకలశా
ధారంబై బ్రతుకుఁ గాంచె దంపతిమధ్యన్. 89

వ. అట్టియెడ నింట నెవ్వరును లేని యొక్కనాఁటి రాత్రిసమయమ్మున నత్తలోదరి మితభూషితాంగియై "అనుగుణంబగు సమయంబు నేఁటికిఁ జేకూరె" నని సంతసింపుచు రహస్యపరికారమ్మున. 90

ఉ. వచ్చి గృహమ్మునొచ్చి యొకవైఖరి నాతనిఁజూచి యంతఁ దా
నచ్చపలాక్షి యాతఁ డసహాయత శయ్యఁబరుండి గ్రంథమున్
జెచ్చెరఁ జూచుచుండఁ దరిఁ జేరఁగ సందియమంది ద్వారమం
దచ్చపు బంగరుంబ్రతిమ యట్టుల దాఁగిలియుండె క్రమ్మఱన్. 91

క. మెలమెల్లనఁ జని శయ్యా
తలనికటమునందు నిలువఁ దత్తఱమున న
వ్వెలఁదుకఁ బొడఁగని యాతఁడు
నిలువున నీరాయె నదియు నివ్వెఱపడియెన్. 92

క. అతఁడును నదియును నిటుల
ప్రతిపత్తి విమూఢగూఢభావోదయసం
గతులై యుండిరి క్షణపరి
మితికాలం బదియు శక్యమే ? వర్ణింపన్. 93

సీ. తనకు నర్ధాంగియై మనము పుట్టకయున్నఁ
'బొమ్మ పొ' మ్మని చెప్పఁబోలదొక్కొ !
ఇచ్చగల్గినఁ జనవిచ్చి కౌఁగిటఁ జేర్చి
మరుకేళిఁ గరఁగింపు తెలుఁగఁదొక్కొ !

అక్కన్నెయెవతెయో యనుట కింతకుమున్ను
ప్రతిదినమ్మను గంటఁ బడనిదొక్కొ !
పాపమంచును భయంపడుట కీలోననే
హృదయసంగతులచేఁ బొదలఁడొక్కొ !

తే. గీ. కామశాస్త్రప్రశంసలఁ గనఁడొ, వినఁడొ !
యేమిభావించెనో యాతఁ డెవరికెఱుక ?
రమ్మనియుఁ బొమ్మనియు మాటరాదు నోట
"వలపు సానికిఁ బలుపు దెబ్బలు" ఘటించు. 94

తే. గీ. అటులఁ దన్నాదరింపని యతనిరీతిఁ
గాంచి మదిలోనఁ గోపమ్ముగదుర మఱలి
పోవుటకు నుద్యమించి యూర్పునిగుడించి
యించుక మనమ్ములోన యోజించి మఱియు. 95

ఉ. దాపునఁజేరి హస్తమునెదం గదియించిన యంతమాత్రనే
కాఁపుర మాయె మేను పులకప్రకరమ్ములకున్, మనమ్ములోఁ
గాఁపురమున్న జ్ఞానము పికాపికలై చనె; నెట్టకేలకుం
బాపపుభీతియుం దొలఁగి పర్విడె; నెంతకుఁ జాల రంగనల్ ! 96

శా. ఆరీతిం గని యాసతీతిలక మత్యానందముంజెంది "నీ
న్నే రామామణి యిట్లుచేయఁగలదోయీ ? యంగనాయోగ్యమౌ
గారామెల్లను నీవచేసెదవు పో ! కాకేమిరా !" యంచుఁ గ
ర్పూరామోదితపూగసంకలితతాంబూలమ్ము నందిచ్చుచున్. 97

ఉ. "మంచిదికాని" "వేశ్యలకు మాయలు మెండెటువంటివారలన్
వంచనఁజేతు" రందు; రది వాస్తవమే; తమవంటి వారికిన్
వంచన మంచి గాదుకద ? వచ్చెదిట్లనె యుత్తరమ్ము వ్రా
యించియు రాకపోవు టిదియేకద ? ధర్మము మంచివారికిన్." 98

తే. గీ. అనిన నతఁడిట్టులను "వింధ్యమనియుఁ బాప
మనియు నేమానితినిగాని యన్య మెఱుఁగఁ;

జేతునని చెప్పియును జెడ్డ సేయరాదు,
చేయననిచెప్పియును మంచిచేయవచ్చు. 99

ఉ. ఇప్పటికై నఁగాని మనమెంతయు సందియమందుచుండె నీ
తప్పులనెప్డు నే నెఱుఁగఁ దన్విరొ! నీమ కతమ్మనంగదా ?
యిప్పటి కిట్టిరీతి ఘటియించె; మఱొక్కటి విన్ము, నీయెడం
ద ప్పెపు డబ్బునో యపుడ తప్పుఁజుమీ! మనస్నేహభావముల్."

క. అని ప్రతినదోఁపఁ బలుకుచు
ననుకంపాకంపితాంతరంగుండై య
వ్వనితామణికిన్ వశుఁడై
యనుకూలుండై పరవశుఁడై తమిఁ జెందెన్. 101

సీ. అజ్ఞాతగాత్రభేదజ్ఞానవిలసనం
బనతీతరతిరహస్యాగమంబు
అనిరుద్ధదంతచ్ఛదామృతాస్వాదనం
బపరియత్నాప్తబంధానుగమము
అనిమిత్తతాడనాన్యోన్యసంభృతసుఖం
బజ్ఞేయపూర్ణమోదానుభవము
అనుపసంహృతవచఃప్రారంభసంరంభ
మనివార్యఘర్మోదకావతార

తే. గీ. మవిదితనఖక్షతవ్యథం బపరిమేయ
రసవిశేషపరిసార మరాళచేష్ట
మనియతాలింగనాఢ్య మవ్వనజగంధి
పరిభమనిధువన మక్కవిపరివఁ డెనసె. 102

సీ. చూచునేమొకొ సిగ్గుచోటులంచును మధ్య
మధ్యఁ గౌఁగిటి కొక్కమాఱుఁ జేరుఁ
గోపగించునొ యంచుఁ గులుకుగుబ్బలమధ్య
మధ్యఁ జేతులకొక్కమా ఱొసంగుఁ

బరిహసించునో యంచు బల్రయమ్మెన మధ్య
మధ్య నాపక యొక్కమాఱు పెనఁగు
శ్రమఁజెందునో యంచుఁ జవులుదేఱఁగ మధ్య
మధ్య నోష్ఠ మ్మొక్కమా ఱొసంగు

తే. గీ. ముద్దులిడి యొడలెఱుఁ గమిమోవిఁ గొఱుకు
బమలుతీర్చనెయసి చేతఁబట్టు ఱొమ్ము
రాజ్యమిది నాదియంచు గర్వమ్ముఁ జూపు
నుపరత మొనర్చు వేళ నయ్యువిదమిన్న. 103

క. కుచకించిచ్చలనంబు క
టిచమత్కారంబు మేని కీవి బెళుకుఁజూ
పుచురుకు సారెకు వర్ణిం
పుచు మెచ్చె నతండు దాని పుంభావంబున్. 104

చ. ఎఱుఁగరు కష్టమింత సుఖమింత విలాస విశేషమింత యం;
చెఱుఁగరు మోహమింత వలపింత పెనంగిన దింతయంచు నా
సరసుఁడు నా సఖీమణియు సౌఖ్యరసాంబుధిలోన మున్గి తే
లిరి; వివరింప శక్యమె! బళీ! మఱి వారి వినోదవైఖరుల్. 105

వ. అంత. 106

తే. గీ. జారిణీజారసురతప్రసంగభంగ
మంగజానంతతాపశాంత్యౌషధంబు
చోరకృత్యాంతరాయ మాచారివిప్ర
కోటివిజ్ఞప్తి విననయ్యెఁ గోడికూఁత. 107

వ. అంత 108

సీ. నలిగిపోయిన పుష్పములు కీలుజడనుండి
యడుగడ్డునకుఁ దోవయందు రాల
మలయు ప్రాతఃకాలమలయవాయువులచేఁ
జెమటబిందువుల మొత్తము లణంగఁ

గురియు నున్మంచుతుంపురులు కెమ్మోము పెనొ
క్కులు కించుక భరమ్ముఁ గలుగఁజేయ
నతిరతిపరవశస్థితి వియ్యమందు ని
ద్దుర నెత్తి కెక్కి తత్తఱముఁజూప

తే. గీ. 'నెవరు చూచెదరో' యంచు నించుకంత
భయముగల్గియు 'నాకేమి భయ' మటంచు
దిటము మదిలోననూని యచ్చటులనేత్రి
"టింగురంగా" యటంచు నింటికిని జనియె. 109

క. దీనజనాదరణా ! శర
ణానుగతాభరణ ! సంతతాశ్రితశరణా !
నానావిధగుణవరణా !
భూనుతచరణాయుధాంకభూతేట్స్మరణా ! 110

శా. ఆగర్భానుగతప్రకృష్టధనధాన్యామూల్యసౌధాదిసు
శ్రీగణ్యా ! సరసాగ్రిగణ్య ! సితసీరేజాతవాతాశనే
డ్నాగాలంకరణాగశీతనగమాన్యస్వచ్ఛకీర్తిప్రిభా !
భోగత్యాగసుయోగ ! సత్కవిజనాంభోజాబ్జినీబాంధవా ! 111

స్రగ్విణి. శ్రీమదానందవర్ధిష్ణుజిష్ణూదయా
రామ ! కామేశ్వరీప్రాజ్యదివ్యాద్దయా
సీమ ! సీమంతినీశ్రీతనూజానయ
గ్రామ ! కామేశ్వరీగర్భచందోద్రదయా ! 112

— గద్య —

ఇది....శ్రీతిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబైన
కేవలకల్పితంబగు శ్రవణానందంబను మహా
ప్రబంధమునందుఁ జతుర్థాశ్వాసము.

శ్రీ ర స్తు.

శ్రీమత్పరదేవతాయైనమః

# శ్రవణానందము

## పంచమాశ్వాసము

క. శ్రీమహితపీఠికాపుర
ధామ! నిరుపమానకీర్తిధవళితసకలా
శామండల! వేంకటర
త్నామాత్యవరేణ్య! రసికతాధికగణ్యా! 1

తే. గీ. అవధరింపు మనంతరం బంత సూర్యుఁ
డుదయగిరి నెక్కె; నతఁడు యథోచితముగఁ
గృత్యములు దీర్చుకొని రాత్రికృత్యమునకు
మోదమందు మఱింత విషాదమందు. 2

సీ. ఏకాంతఁ గనఁగొన్న నీసడించెడిబుద్ధి
యాకాంతమీఁదఁ దా సోఁక నేల?
సోఁకిన నేమి, యాసుందరీమణి తనం
తనె వచ్చి నన్నుఁ గైకొనఁగనేల?
కైకొన్న నేమి, చిక్కఁదనం బఱంగ నా
కామినీమణితోడఁ గలయనేల?
కలసిన నేమి, యాకామినీమణి పొందు
పరవశత్వమొనర్చి పరఁగనేల?
తే. గీ. పరఁగుఁగాకేమి, బుద్ధి దా మరల నేల?
మరలుఁగాకేమి, బొత్తిగా మరల దేల?
వేయిమాటల ఫలమేమి, విధికినైనఁ
గామదేవు జయింప శక్యమ్ముకాదు. 3

మ. ధనమా, పోవును; మానమా, చెడును; నిందా, నెత్తిపై కెక్కు; లో
నను మానింతురు తల్లిదండ్రులు; కులంబా, వన్నెకుందక్కు; నూ
తన మాంద్యమ్మ ఘటిల్లు; బంధుగులు పంతంబొప్ప నిందింతు; రో
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! 4

మ. 'విను నీబోఁటులనంగ నెంత? మును గంభీరప్రభావాఢ్యులౌ
మునులే ముచ్చటలందు మున్గి; రిదియేమో పెద్దబ్రహ్మాండమా?'
యన రాఁబోకుము వారికి న్మనకుఁ గొండం తంతరం బున్న; దో
మనమా! వద్దిఁక నాదుమాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! 5

మ. 'మును లీలాశుక కాళిదాసకవిరాణ్ముఖ్యుల్ ధనస్త్రీలతో
దను గ్రీడింపరె! దాన వారల ప్రతిష్ఠల్ వోయెనే?' యంచు నీ
వనఁ దప్పొఁ జుమి; నక్కయేడ! దివిజాధ్యక్షాలయం బేడ! నో
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! 6

మ. "తనయంత న్నినుఁ గోరి వచ్చినది యా తన్వీమణి స్వేచ్ఛఁగాఁ
జనునే? నీ కని బుద్ధిచెప్పెదవు మెచ్చన్ వచ్చు నీబుద్ధి; యీ
తనువే శాశ్వతమా! పరమ్ము వలదా! తప్పుల్ విచారింపవా!
మనమా! వద్దిఁక నాదుమాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! 7

మ. తనువుల్ బుద్బుదముల్, యశం బనఁగ నిత్యమ్మట్టి యీ సద్యశ
మ్మును నీతుచ్ఛసుఖాప్తికై క్షణములోఁ బోఁగొట్ట నుంకించె దీ
వనుమానింపవు లేశమాత్రమయినన్ హా! యెంత దౌర్భాగ్యమే?
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! 8

మ. జననం బంది సమస్తపండితులు మెచ్చన్ దెచ్చికొన్నట్టి కీ
ర్తిని నిష్కారణ మొక్కనాతికయి వార్ధిం గల్పఁగానేల? లోఁ
గను, అంకొక్కటి నూఱునోములను మెక్కంజాలు నిక్కమ్ముగా
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా!

మ. "వనితాసంగమ మెన్నఁ జంచలము, స్వప్నప్రాభవం; బట్లు కా
దని చేయం బరిణామనీరసకరం, బాజోలికిన్ బోకు, మీ
వని వేసారులు చెప్పియుం దుదకు నాహా! యెంత చేయించితే!
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! 10

మ. "నను నీ వెప్పుడుఁ బాయ వ"ద్దనుచు నా నారీవతంసంబు దె
ల్పిన 'నట్లే' యని యొప్పుకొంటి, నిపు డాలేమ న్విడంబాప మౌ
నని యూహించెద, వెంత సత్యమతివో హా! మెచ్చఁగావచ్చు నిన్
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! 11

మ. "జననంబందిన దానికీ ఫలము వేశ్యాకామినీవక్త్రచుం
బనమే కాక మఱేమి యున్న దిదియే భవ్యం బభవ్యంబు గా"
దని వాదించెదు, నీ చరిత్రి మది వహ్వా! మెచ్చఁగా వచ్చు వో
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! 12

మ. జననం బందిన దానికిన్ ఫలము సచ్చారిత్రుఁడై సర్వస
జ్జనులుం దన్ను నుతింప ధర్మపరుఁడై సాక్షాత్పరబ్రహ్మముం
గన నూహించుట కాక, కామి యయి భోగస్త్రీల భోగింపుటా?
మనమా! వద్దిఁక నాదుమాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! 13

మ. "తనుఁదా వచ్చినవేశ్యఁ గూడు సుఖ మింతా! యెంతయో తెల్పనా
కను వౌనా? యది యట్టు లుంచు మిది బ్రహ్మాదుల్ గణింపంగ శ
క్తిని బొందం గలరా!" యటం చనెదు, నీ తీపింత గాఁబోలు నో
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! 14

మ. "అనువయ్యెన్ గద! నీకు దీనికిని జాత్యాదుల్ కళాశాస్త్రరీ
తివి, వహ్వా యిఁక దీనిపైఁ జనెడి బుద్ధిన్ ద్రిప్ప నీ వొప్పుకొ
న్నను నేనొప్పెదునే?" యటం చనెద వన్నా! యెంతస్వాతంత్ర్యమే
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! 15

క. అని యీగతిఁ దన మనమున
ననేకరీతులుగ నెంచి యమితాపమ్మున్
గను నాలోచనె యచ్చెలి
చను దెంచె యథాస్థితముగఁ జదు వమ్ము మిషచే. 16

క. చను దెంచెఁగాని యాతని
మును పటిరీతిఁ గను జూడ మోమోటముఁ జెం
దును, వెల్వెలఁ బాఱును, సి
గ్గును గను; మెతకగుణ మెంత క్రూరపుగుణమో! 17

చ. చదువఁగ సంశయించు, నెకసక్కెము లాడఁగ సంకయించు, సౌం
పొదవ ఋజుప్రకారమున నూరక యుంటకుఁగూడ సంశయం
బెదఁగను, నింతకన్న మునుపే కడు మేలని లోననెంచు నా
సుదతి; పరుల్ గదా! హృదయచోరులు కాంతల కంత దాఁటినన్. 18

వ. పిమ్మట నాతండును నిశీథసమయంబున మదనవిధుప్రేరితుండై యద్దాని
గృహమ్మున కేతెంచుచు హఠాత్సంజనితకించిద్వివేకవశమ్మున. 19

మ. ఘనరాజన్యశిరస్తటీమకుటసత్కారమ్ముచే మించు న
న్ననుఁ బ్రేరేపణఁ జేసి వ్యర్థముగ నెంతో పాప మార్జింప నీ
ధననారీమణిచెంతఁ ద్రోచె, దిదియున్ ధర్మమ్ముగాఁ దోఁచెనే?
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! 20

మ. చనవొప్పన్ జనపాలసేవకనమస్కారమ్ములం గొంచుఁ, ద
ద్ఘనసౌధమ్ముల ద్వారసీమలను నిత్యమ్ముం బ్రివర్తించు న
న్నను నిర్లజ్జునిఁజేసి వేశ్యగృహమున్ దూర్పంగ నీకొప్పునే?
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! 21

మ. ఇది దుష్కార్యమటంచు నాతఁడిటు లెంతే లోన నూహించుచుం
దుదకున్ గూఢముగాఁ దదీయగృహమున్ దుంఋత్కుమైఁజేరి, య
మ్మదిరాక్షీఘనసుస్తనాగ్రపరిరంభ ప్రక్రియా భోగసం
పదచేఁ దానెవరో యెఱుంగఁ; డపుడుం బాండిత్యముల్ దోఁచునే!

మ. అటులేగెన్ మఱికొంతకాలము రహస్యప్రక్రియల్ దోఁప న
చ్చటి కీతండును నేగు, నిచ్చటికి నచ్చందాస్యయున్ వచ్చు, నె
ప్పటి కేప్రక్రియ వీళ్లా యట్టులగుఁ; జెప్పన్ శక్యమే? దైవసం
ఘటనానైపుణి యాతఁడయ్యదియొ? యక్కంజాక్షియే యాతఁడో?

చ. మదిని విరక్తి దోఁచెనా; సమంజస మీపని గాదటంచు బు
ద్ధి దిరిగి పోయెనో, మఱి పదింబది పెద్ద లొనర్చు నిందకుం
బెదరెనొ యేమొకాని, సరవిం దదనంతర మా లతాంగి కా
ర్తిదుఁడయి యాతఁ డేగెఁ బరదేశ మొకానొకఁడా నెపమ్మునన్. 24

క. శ్రీమంతము సతతహిమా
సీమంతము వర్జితతటినీ గాహన కే
శీమంతము పరిబలించెన్
హేమంతము విరహిజనులకే కుంతం బై. 25

క. చలి వెట్టి యుష్ణరుచి కం
బలకంచుకరాంకవావ్యపహ్నుతుఁడై యి
మ్ముల ముణుఁగఁబోలుఁ; గిరణ
మ్ముల పసలేకున్నఁ దగ్గిపోవునె? యుండున్. 26

చ. పగలు కృశించె, రాత్రివిరవాతెఁ గుబేరదిగంతరాగతా
శుగము జనాళి కాశుగము సొంపునఁ దోఁచె ననంగవహ్ని హె
చ్చె, గిరివరమ్ము లన్నియు హసించె హిమాచలమున్, జలమ్ము పం
డ్లు గొఱుకసాఁగె, వృద్ధులు కడున్ భయమందిరి పాంథభామలున్.

తే. గీ. అట్టి హేమంతమున నతఁ డన్యదేశ
వాసి యగుటకు నబ్బాల వగలఁ బొగిలి
నూతనవియోగమెంతయుఁ జేత మెరియఁ
జేయఁ దనయంతఁ దా నిటుచింతఁ జెందు. 28

సీ. "గుబ్బలా యివి? కావు; కుంభికుంభోరోజ!
నాపూర్వజన్మపుణ్యములు గాని
అధరమా యిది? కాదు; మధురబింబఫలోష్ఠి!
రహిమించు నమృతపాత్రంబుగాని
కన్నులా యివి! కావు; కమలసన్నిభనేత్ర!
కళలనీనెడి ధేనుక లగుఁ గాని
వదనమా యిది? కాదు; వారిజారిసమాస్య!
నామనోరథనిధానంబు గాని

తే. గీ. బాలికవు నీవు గావహో! నీలవేణి!
లీల నూఁగెడి మరునిడోలికవు గాని"
అనుచు నుపరతవేళ నన్నాదరించు
వాని మేలెట్లు నే మఱవంగ నేర్తు? 29

చ. నిను విడనాడి నేఁటికి గణింపఁగ నొక్క నెలాయె నోయి! నిన్
గనుఁగొను నిచ్ఛఁ గన్నులును గాయలు గాచెఁగదోయి! పేర్మి నె
మ్మనమున నెంచవోయి! యనుమానము మానఁగదోయి! నాపయిం
గనికర ముంచవోయి! కడకంటను జూడకు మోయి! మ్రొక్కెదన్.

క. అని చింతించుచు మధుసూ
దను మిత్రుం డొక్కఁడతని తావునకుం బో
వు నెసకమున్ విని యవ్వన
జనయన తనవంత యతని సన్నిధిఁ జెప్పెన్. 31

తే. గీ. మాటిమాటికిఁ జెప్పి యమ్మగువమిన్న
చింతగొనుటయు, నాతఁ డచ్చెలియ తమక
మెల్ల మధుసూదనునితోడ నెఱుఁగఁ జెప్పెఁ;
జెప్పినంతనె యాతని చిత్త మదరె. 32

తే. గీ. ఇన్ని దినములనుండి యావన్నెలాఁడి
తోడఁ గ్రీడించు భాగ్యంబు గూడదయ్యె;
సౌఖ్యములు పెట్టిపుట్టని సమయములను
సౌఖ్యములు గోర నేరికి సంభవించు ? 33

ఉ. ముక్కర ముక్కునం గదిసి ముద్దులు గుల్క, బులాకి మోవిపై
చక్కి నటింప, లే నగవు చాయయు లజ్జయుఁ గుమ్మలాడ నా
యక్కనఁ జేరి నాయన నయమ్ములకుం బ్రీతిఁ జెప్ప కెక్కడో
మక్కువఁ గౌఁగిలించుకొను మత్సుకృతమ్మను జూచు టెన్నఁడో ?

సీ. నాముద్దులమిటారి నావన్నెలకటారి
నాపున్నెములకోవ నాదుచేవ
నావలపులదీవి నాయమృతపుబావి
నాసొగసులతేట నాదుమూట
నాకోరికలయిక్క నానోములచుక్క
నారసమ్ములసీమ నాదుప్రేమ
నాకనుఁగవవిందు నాపెనువగమందు
నాకల్మి నాబల్మి నాదుచెల్మి

తే. గీ. నాదు రెండవప్రాణంబు నాదుబోధ
నంబు నాగుట్టు నామట్టు నాదుపట్టు
నన్ను విడనాడి యేగతి నున్న ధూర్త
చెప్ప కేగె నటం చేమి చేసె నోర్త; 35

ఉ. "నాతిరో ! లాతియూరికిని నాథుని నంపితివా" యటన్న 'నే
నాతటి నూర' లే నవి తనంతనె కన్నులనీరు గాఱఁగా
గాతర వైతి వంచుఁ జెలికాఁడు వచించెను; నాదుకన్నులే
యాతమిఁ జూచెనేని మగువా ! యని యెంత విచార మొందునో. 36

చ. క్రమముగ మానసంబు కనుగందు నినుం గను భాగ్య మబ్బమిన్ ;
దమకము హెచ్చి, మిన్నుపయి దాఁటినయట్టులఁ దోఁచె నీదు పై
దములకు వాచెఁ గన్నులు, ముదంబు యథాయథలై నశించె, శ
క్యమయిన స్వప్నమందయినఁ గన్పడుమా ! యొకమాఱు నెచ్చెలీ !

సీ. చిఱునవ్వు మొగమందుఁ జెంగలింపఁగ సిగ్గు
పడుట కైనను సిగ్గు వడెడిదావి
భక్తి విశ్వాససంపర్కమ్ముచే బయల్
పడెడి కించిత్ప్రేమభరముదావి
ఇటు చేయు మని చెప్ప నెట్టకేలకు సమ్మ
తించి తత్కృతి నాచరించుదావి
సురతమ్మునం దనాదరము గల్గియు నాద
రమ్ములేదని చెప్ప రావి దావి

తే. గీ. నుత్తరము చెప్పఁదగినట్టియు త్తరమున
మొగ మొకింతుక వంచుక మూరిదావి
ముగుదయని మధ్యయని చెప్పఁదగనిదానిఁ
జూడఁదగుసోయగముదానిఁ జూడవలదె ! 38

చ. గరువపుఁజెయ్వులా ? మెయినిగారములా ? కులుకారుతీరులా ?
పరువమునిగ్గులా ? వలపుభావములా ? రస మొల్కునల్కలా ?
మఱవని ప్రేమలా ? తలఁపు మర్మములా ? వెలలేని ముద్దులా ?
యఱువదిమందియైన సరియా ? మఱి యాకరియానయానకున్. 39

ఉ. బోటిరో! నాఁడు నేలకులు పొల్పుగ నా కిడువేళ బ్రేమనీ
నీటగు గోట గీఁటి? తది నేఁటికి నిన్ను స్మరింపఁ జేసెడిన్
మాటలు వేయునేల? యొకమాట వచించెద నెంచి చూడఁగా
మాట లడంగుఁ గాని మఱి మచ్చలడంగునె? మానినీమణీ! 40

చ. రతి యన నెట్టిదో యెఱుఁగరాని ననుం గని యాత్మశక్తిచే
నతివరో! జారపూరుషులయందు మహాత్మునిఁ జేసినట్టి నీ
చతురతకేమనందుఁ? గడు జాణవు జాణవు జాణ; వింత చి
న్నతనములోన నింతటి ఘనంబగు శక్తియుఁ గల్గియుండునే? 41

క. ఎన్నఁడు రతి నెఱుఁగనియా
మున్నే మెఱుఁ గాయె, నింత మునిఁగె నెఱిఁగినం;
"దిన్నమ్మకుఁ దిన్నంతయుఁ
గన్నమ్మకుఁ గన్నయంత" కాదె మృగాక్షీ? 42

చ. "వ్రతమును బాడుచేసి నను వంచనఁ జేసితి వెంతదానవే?
యతివరో" యన్నమాట కహహా! యని నవ్వుచు "ముద్రవైచియుం
చితిరె? బిగింపు మాట లిఁకఁ జెప్పకుఁ" డంచు వచించునాఁటినీ
చతురత నేఁటికిన్ మదిని జల్లనివేళఁ దలంతుఁ గోమలీ. 43

చ. అలదినమందు నాస్థలమునం దల కేళిగృహమ్మునందు నా
సలు దనివార నీసురతసౌఖ్యము దేలిననాఁట నుండియుం
గులసతిమోము గన్గొనుటకున్ మనసొగ్గదు; "అంకు సాఁగఁ బెం
డిలి యిఁక నేల" యంచును బఠించెడి పెద్దలనోరు క్రొవ్వెనే? 44

ఉ. దూరమునందునుండియును దొయ్యలి! దగ్గఱ నున్నరీతిఁగా
బీరముఁ జూపుచుంటి వది భేషు! సెబాసు! బళా! యిదేమి? యో
నీరజగంధి! కంటికొక నిద్దురపట్టక మున్నె పక్కలోఁ
దూఱెదు; కన్నువిచ్చినను దుట్టున దూఁటెద వెంత దానవో? 45

ఉ. అన్నులమిన్న! నిన్నుఁగని యందురు కొందఱుమూర్ఖు "లెంతయుం
జిన్నెలు వన్నెలుం గలుగు చేడియగాదిది" యంచు, దాన నీ
వన్నెల కేమి లోప? మది వారలకన్నులలోప మెన్న, నా
కన్నులు వారు పెట్టుకొని కాంచిన నోరులు మూయకుందురే. 46

ఉ. అన్నిటి కేమిగాని మగువా! యొకటే నిజమైనమాట, నీ
చిన్ని మెఱుంగుఁజూపులును జిత్రిపుఁ బల్కులు మొల్కనవ్వులుం
దిన్నని భక్తియుం దనివి దీఱని పేర్మియు నెంతతండ్రిలో
నున్నను నిన్ దలంపుటకు నోపిక నాకిడఁజాలెడుం జామీ. 47

చ. మమత దలిర్పఁగా నుపరిమన్మథకేళిని గూడువేళ "నో
రమణిరో! నన్నుఁగూడి యిటు అంతులు నేయఁగ నీకుఁ జెల్లెఁగా
క మహిని దేని కా" ననినఁ "గాక మతే, మిది నాదుపూర్వపు
ణ్య" మని వచించు నీదు వచనంబులు నామది నాట కుండునే? 48

ఉ. రాపిడి గబ్బి గుబ్బల నురమ్మునఁ గ్రుమ్మచుఁ గోర్కి తేపుచుం
గోపము లేకయే కసరి కొట్టుచు "నొచ్చితి" వంచు వింతలం
జూపుచు ముద్దుపెట్టుచును సొంపుగ నన్మొగ మెత్తిచూచు నీ
చూపుల కీయఁగా వలదె? సోలెడు పద్యము లంబుజాననా. 49

చ. సముఖముఁ జేరవచ్చి బిగిచన్నులఁగ్రుచ్చి కవుంగిలించి ప్రా
యముతమిఁజూపుచుం దమలపాకుల చిల్కలు నోటఁబెట్టుచున్
దమకముమీఱ నన్నుపరతమ్మున సోలఁగఁజేయునట్టి భ
ద్రముగల నాఁటిరోజు లిఁక రావిఁక రావిఁక రావు నెచ్చెలీ! 50

చ. రకముగ నన్నుఁ గూడుటకు రాతిరివెన్నెలవేళ రాఁగ, మె
చ్చి కవుఁగిలించి "నీవెవరో? చెప్పుము నాయికలం" దటన్నఁ జె
ప్పక నగుఁబా టటంచుఁ బొరపాటున మెల్లనఁ "జంద్రికాభిసా
రిక" నవిపల్కు నీ వచనరీతులు నా మది నుంతకుండునే. 51

ఉ. 'పావనకీర్తి యీతఁ' డని పండితులెల్ల నుతించి కొల్వఁగా
భూవలయమ్మునన్ యశముఁ బొందుచు నుండెడి నాకు నయ్యయో!
నీవగలే సదా మదిని నిల్పి భజించుట లబ్బె నెచ్చెలీ!
దైవము వ్రాయువ్రాఁతలవి తప్పవుగా భువి నెంతవారికిన్. 52

చ. సొగసులదొంతియైన యల సుందరి చెయ్యు లవెంత మూర్ఖుఁడుం
బొగడఁగ రాని వంచనఁడు; పున్నెము లేనిదినమ్ములన్ స్మృతిం

దగులఁగఁజేసి నాకుఁ బరితాపము హెచ్చఁగఁ జేసి నీవునుం
బొగిలిన నేమియో! మఱచిపోయి సుఖమ్ముగ నుండు చిత్తమా. 53

ఉ. రాతిరి కొంత నిద్ర గదురంగనె దూరమునందు నున్న యా
నాతినిఁ జూడఁబోయి యట నాలుగుజాములు మండి యిప్డుగా
చేతమ! వచ్చితీ; విటులఁ జేసిన నిన్నిఁక నేమి నేసినం
బాతక మున్నదే! యిటుల భామల మాయలఁ జిక్కవచ్చునే! 54

సీ. "స్త్రీలఁ గూడినఁ జేటు చేకూఱు" నని సదా
పలుకు నే నాబాలఁ గలయనేల?
కలసిన నేమి, 'లోకులు విన్న మర్యాద
లకు భంగ' మని భీతిలంగ నేల?
భీతిల్ల నేమి, యాభీతభీతమృగాక్షి
నట డించి యచ్చోటి కరుగనేల?
అరిగిన నేమి, యాయంగన కొకనీటి
బొట్టు డించక యిట్లు పొక్కనేల?
తే. గీ. గతజలమ్మున కీయానక ట్టదేల?
యెట్టినేర్పులు గలిగిన దిట్టయైనఁ
బరులకును బుద్ధులను జెప్పవచ్చుఁ గాని
యాత్మకై నప్పు డాబుద్ధు లడుగువట్టు. 55

చ. కలిమి చెడంగనిమ్ము, కులకామినిదిట్టినఁ దిట్టనిమ్ము, నిం
దలు గలుగంగనిమ్ము, తలిదండ్రులు గుందినఁ గుందనిమ్ము, సం
కెలలు పడంగనిమ్ము, తనకీర్తికి భంగము గల్గనిమ్ము, దాఁ
గలసినకాంతఁ బాయు టది కష్టము కష్టము కష్ట మక్కటా! 56

ఉ. మారకళావిశేషముల మర్మములెల్లఁ బఠించి, లక్ష్యముల్
నేరుచు టెట్లొకో యనుచు నేను విచారణ నేయుచుండఁగా
నా రమణీలలామ తనయంతనె తాఁగరుణించి నేర్పఁగా
నేరిచినాఁడ; దాని విడనేర్తునె? నేర్చిన దైవ మోర్చునే! 57

క. అని యీగతి మోహాబ్ధిని
మునిఁగి మనోరథరథమ్ముఁ బూని యతఁడు వే
గ నిజావాసముఁ జేరెను
మనోరథము నిలుపఁదగిన మానిసి గలఁడే? 58

వ. అట్లు వచ్చినపిమ్మట.

ఉ. అక్కమలాక్షి యాతఁడును నగ్గలమై తనరారు పేర్మి పెం
పెక్కఁగఁ గొంతకాలము యథేష్టసుఖమ్ములఁ దేలుచుండఁగా
నొక్కెడ నత్తలోదరియు నొక్క యయోగ్యతఁ జేసెఁ; గంబళిన్
మెక్కుచు వెంద్రుకల్ వెదుక మేకొనుచోఁ గల వాని యేరికిన్! 60

తే. గీ. రాజరాజైన నెంతటి ధనికుఁడైన
నెంత గారా మొసంగిన నెంత ధన మొ
సంగినను జాటున నొనర్చు దొంగసంగ
తుల నొనర్పక మాన దీ తులువజాతి. 61

వ. ఇట్లబ్బాల తన వృత్తివైఖరిం బ్రవర్తింపుచుంటయు. 62

క. ఎఱుఁగక యాతం డెప్పటి
కరణిన్ వర్తింపుచుండెఁ గామవశుండై
ధర గణికాంగన లొనరుచు
దురుపాయము లేరికైన దుర్జ్ఞేయంబుల్. 63

వ. ఇట్లున్నంత.

క. అమ్మధుసూదను కష్ట సు
ఖమ్ములకు సమప్రసక్తిగల గుణవంతుం
డమ్మగువదైన వృత్తాం
తమ్మంతయు నెఱిఁగి యిట్లు తలపోసె మదిన్. 65

తే. గీ. ఎన్నివిధములఁ జెప్పిన నితఁడు మున్ను
వినక తుద కాచరించె నవ్వేలఁది పొందు;
ఆచరించుట కేమి, 'యయ్యతివమిన్న
కన్న గుణవతి' లేదంచుఁ గళవళించు.

ఉ. 'అందమునం దుఁ గాని మరియాదలపట్టునఁగాని నేమపుం
జందమునందుఁగాని వెలచానలలోనన కాదు, దీనికే
చందనగంధులున్ సవతు సల్పఁగ రా' రని యూరుచుండు; రో
సుందరులం దగుల్కొనిన సోమరులన్ మఱలింపశక్యమే ? 67

తే. గీ. అయిన నిద్దాని యవగుణం బతనితోడఁ
జెప్పి విడఁదీతుఁ గాక యచ్చెలియ పొందు;
పత్నితో భర్తనెడఁబాపఁ బాప మండ్రు
కాని వెలయాలి నెడఁబాపఁ గలుషమనరు. 68

వ. అని నిశ్చయించి యమ్మధుసూదనుకడ కేతెంచి తత్కాలసముచితాలాప
మ్ములం గాలమ్ముగడపుచు నబ్బాల దుశ్శీలంబు సకృత్సంబుగాఁ
జెప్పి యొప్పించి మఱియును. 69

ఉ. మాయలమారులైన వెలమానిను లెక్కడ ! నేమపుంగతుల్
వాయకయుండు టెక్కడ ! ప్రపంచమునం దెటువంటివారలున్
రోయక యుందురే ! కడలుద్రొక్కిన దెట్టిలతాంగియైన దు
ర్జ్ఞేయము లీధనాంగనల చిత్తము లిందు భ్రమింప రుత్తముల్. 70

క. ఇంతకుమును మీతోడన్
మంతనమునఁ జెప్పినట్టి మాటలలో నొ
క్కింతయు నయథార్థముగా
కంతయు నిజమాయెఁగా యటంచు బలికినన్. 71

క. ఆతఁడు చెప్పిన మాటలు
చేతమ్మున కెక్కి దాని చేష్టలయందుం
బ్రీతి నెడి తనదు ప్రీతిన ని
రాతంకముగా నొనర్చ నాత్మగతముననన్. 72

మ. గొనముల్సున్న, హుళక్కి సత్య మహహా ! కుర్మల్నభఃపుష్పముల్
మనముల్ సూడ శతావధానకృతులే, మానమ్ము కుందేటి కొ
మ్మని నీ వెల్లనెఱింగి వారసతి నాహా ! యెట్లు వాంఛించెదే !
మనమా ! వద్దిఁక నాదుమాటవినుమా, మర్యాదఁ గాపాడుమా ! 73

మ. 'ధననారీమణులెల్లఁ దుచ్ఛమతులే తథ్యమ్ముగాఁజూడ నీ
ధననారీమణిమాత్రి మెుక్కటె మహాధన్యాత్మ కాఁబట్టి దీ
నిని వర్జింపుటకూడ' దంటి విపుడేనిన్ గూడునా, కూడదా ?
మనపూ ! వద్దిఁక నాదుమాటవినుమా ! మర్యాదఁగాపాడుమా ! 74

క. ఈగతి దృఢనిశ్చయుఁడై
యాగరితకు వ్రాసెనిట్టు "లకటా ! యశమున్
బోఁగొట్టికొంటి నీయను
రాగము నిజమని తలంచి రమణీమణిరో. 75

క. చెలికాఁ డాడిన పలుకులఁ
గల యర్థం బెఱుఁగలేక కలికిరొ ! నీవ
ల్కాలె వేదము లని మారిసిన
కలుషాత్మున కిట్టిఫలముఁ గలుగక యున్నె. 76

ఉ. నిన్ననసేల ! నీదు కులనీతి నెఱింగినవాఁడనయ్యుఁ బే
రెన్నికఁ గన్న సద్యశము నెంచక చంచలమానసుండనై
వన్నెయు వాసియుఁ జ రుచిరవర్తనముం జెడఁగొట్టుకొంటి నా
కన్నను మూర్ఖుఁ డింకొకఁడు గానఁగరాఁ డిఁక వేయునేటికిన్. 77

చ. వలపు నిజంబటంచు మగువా ! మది నమ్మితిఁ గాని యిన్ని మా
యలు గలదాన వం చెఱుఁగనైతిఁ గటా ! సరివారలందు నా
దలయును వంచుకోవలనెఁ దన్వి ! వ్రితంబు చెడెన్ సుఖమ్మునుం
గలుగకపోయె నిట్లగునుగా ! వెలకాంతలతోడి కూటముల్. 78

ఉ. ఓవనజాక్షి ! నీదు కులయోగ్యత లెల్ల నెఱింగి నీపయిన్
భావము నిల్పి పండితులుఁ బామరులుం గడుఁగేలి సేయఁగా
దే ! విధిచోదితుండనయి తేలిక కేలికనైతి; నేరికిం
గేవల కాలకర్మ గతికిం బ్రతికూల మొనర్పఁ జెల్లునే ! 79

సీ. పుట్టినాఁడనుకదా ! భువనప్రసిద్ధమౌ
వైష్ణవకులమందు వనజనయన !

చదివినాఁడనుకదా ! సకలవిద్యలను స
జ్జనులెల్ల మెచ్చంగఁ జంద్రవదన !
తిరిగినాఁడనుకదా ! పరదేశములను వి
ద్యాప్రసంగములకై తలిరుఁబోఁడి !
పొందినాఁడనుకదా ! భూమిలో నీపాటి
వాఁడు లేఁడనుకీర్తి పద్మగంధి !

తే. గీ. అట్టి నాబోఁటి నీబోఁటియైనయొక్క
కాంత కాసించుటే యొక కాని మాట;
దానిలోన రసాభాసదశయుఁ గూడఁ
గలిగెనేనియుఁ జెప్పనా ! కలికి ! సుఖము. 80

క. ధన మీనో ? మన మీనో ?
చనవీనో ? నీదు జాతిచందము కాకు
న్నను నొకటి తక్కువున్నదె !
పని లేదిఁక నీ గుణంబు బయటం బడియెన్. 81

తే. గీ. కప్పపుంబొడి పంకంబుఁ గలిపి దాని
యందుఁ గస్తూరిగూర్చి దోహదముచేసి
చావిపి పన్నీటితోడఁ బెంచుదురుగాక
యున్నవాసన వాయునే ? యుల్లిగడ్డ. 82

తే. గీ. గతజలమ్మున కిఁక నానకట్టగట్ట
నేమియగు ? నీకు నాకును ఋణముదీఱె;
మంచిపనిఁ జేసితివి, నాదుమాట కేమి,
జగతి కుపకారమగు చర్య సలిపితీవు. 83

ఉ. వెలచెలులన్ వివేకులగు పెద్దలు పెండ్లికిఁ బిల్వరాదు; వా
రలు గల పెండ్లికిం జనఁగరాదు; జనం గనఁబోల దాటపా
టల; నదిగాక విద్యలఁ గడంగి వచింపఁగ రాదు; దీనికిన్
సొలసినవారికెల్ల మధుసూదను దుర్గతి రాక తీఱునే ? 84

తే. గీ. అనుచు నెఱుఁగంగ నేర్చినయట్టివారి
కెల్ల నెఱుఁగంగఁ జేసితి విందువదన !
యెఱుఁగ నేరనియట్టి సోమరుల కీవ
కాదు బ్రహ్మయు బోధింపఁగాఁ గలాఁడె ! 85

క. నాకొక్కని కపకారము
చేకొని యొనరించి తంచు సిగ్గిలఁ దరుణీ !
లోకోపకారకంబగు
నీకృతికిన్ మెచ్చవలదె ! నేర్వరు లెందున్." 86

క. అని కమ్మ వ్రాసి పిదపం
దనయంతన విడిచె దానిఁ దగ నమ్మధుసూ
దనుఁడు; మనము విఱిగినచో
వనితామణు లన్న గడ్డిపరకలు గారే ? 87

క. వాసవునకైన ధనకాం
తాసంగతి వలదు, దానితత్త్వమ్ము రసా
భాసము నిక్కము; సుగుణ
వ్యాసంగులు దాని బారిఁ బడరెప్పట్లన్. 88

మ. అతఁ డీరీతిఁ బరిత్యజించుటయు నయ్యబ్జాక్షియుం గొంతఁ దా
మతిఁ జింతించి క్రమమ్ముగా నతని ప్రేమ న్మాని పెన్మాయలాఁ
డితనం బూని స్వవృత్తి నెల్ల విటగోష్ఠిం జెంది పెంపొందె నౌ!
"గతిలేనమ్మకు గంజి పానక" మనంగా నిక్కమౌనే కదా ! 89

సీ. తలిదండ్రు లింటిపెత్తన మొకించుక లోటు
జరుగకుండెడిరీతిఁ జక్కఁబెట్ట
ననుకూల మగురీవిఁ దనకాంత తనకెంత
యును వన్నె వాసి నార్జనము సేయ
నతిభక్తి గలశిష్యతతు లెల్లవేళలఁ
దను గొల్చి బుద్ధిమత్తను భజంప

లక్ష్మీసరస్వతుల్ దమ పరస్పరవైర
ములవీడి తనగృహమ్మున వసింప

తే. గీ. బాంధవశ్రేణులెల్ల సెబా సనంగ
సకలదిగ్దేశరాజన్యసభలయందుఁ
దనయశమ్ము నిరంకుశత్వము వహింప
సుఖముగా నుండె నమ్మధుసూదనుండు. 90



క. సతతపరిశ్రుతభూదై
వతమృష్టాన్న ప్రదానవర్ధిత కీర్త్యం
చితతాదృశజనకయశో
వితతీ! తతజగదతీతవితరణసుకృతీ! 91

మ. పరిపూర్ణాయురపారభాగ్యవిలసద్భావాంచితా! కీర్తిసం
భరితాశాంతర! సత్కవిత్వకుకవిత్వస్ఫూర్తినిర్భేదత
త్త్వరహస్యప్రథమానబుద్ధిబలసంతానాధికా! నిత్యస
త్యరతా! చెల్మయమంత్రిపుత్ర! కవిరాడ్దారిద్ర్యవిచ్ఛేదకా! 92

క. నానాఫలపుష్పాగని
దానోద్యానాంతరస్థితసుసౌధతలా
మానబుధసుకవిమిత్రవి
తాన వినోదావధాన! దాననిదానా! 93

— గద్య —

ఇది శ్రీ....కింకవీంద్రఘటాపంచానన విద్వత్కవి బాలకలానిధి
బాలసరస్వతీ శతావధాని శ్రీ తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం
బయిన కేవలకల్పితం బగు శ్రవణానందం బను మహా
ప్రబంధమ్మునందు సర్వంబును పంచమాశ్వాసము
సంపూర్ణము.

---